## శ్రీ బాలాసాహెబ్ దేవరస్....

శ్రీ మధుకర దత్తాత్రేయ దేవరస్ సర్ సంఘ చాలక్ గా బాధ్యత స్వీకరించిన తరువాత-తొలిసారిగా 1973 డిశంబరు 12-15 తేదీలలో ఆంధ్రప్రాంతమునకు విచ్చేశారు.

స్వయంసేవకులను కలవాలని, కార్యకర్తలతో కూర్చొని సంఘకార్యమును సమీక్షించాలని, పౌర ప్రముఖులను కలిసి సంఘకార్యమునుగురించి నివేదించాలని వారి సంకల్పం.

తమ నూతన సర్ సంఘచాలక్ ను సందర్శించాలని స్వయంసేవకుల తహతహ; తమ నాయకుని ముందు కూర్చొని మార్గదర్శనము పొందాలని కార్యకర్తల ఆకాంక్ష; ఈ కొత్తనాయకుని చూడాలని, వారి ఆలోచనలను వినాలని పౌరమహాశయుల కుతూహలం.

ఈ అంశము లన్నిటిని దృష్టియందుంచుకొని ఆంధ్రలో వారి కార్యక్రమాలు రూపొందించబడ్డాయి.

12, 13 తేదీలలో విజయవాడలో; 14, 15 తేదీలలో హైద్రాబాద్ లో కార్యక్రమములు ఏర్పాటయినాయి. కోస్తాజిల్లాలవారు విజయవాడలోను తెలంగాణా రాయలసీమ జిలాలవారు హైద్రాబాద్ లో ఏకత్రితమైనారు.

సత్వరం శాఖలను విస్తరించాలని, సంఘ కార్యము జాతీయజీవనమందలి వివిధరంగములలోకి వ్యాపించాలని

స్వయంసేవకుల నుద్బోధించారు సంఘస్థానములలో. కర్తవ్యము గ్రాహ్యమైంది స్వయంసేవకులకు. ఉత్తేజితు లైనారు వారు.

ప్రాంతమండలి శాఖల పరిస్థితులనూ, వానిని మూల మూలలకు వ్యాపింపజేయు అవకాశములను గురించి చర్చించారు కార్యకర్తలతో. స్పష్టమైన కార్యకల్పన ప్రాప్తించింది వారికి.

శ్రీ గురూజీ ఆశించినట్లు కార్య విజయమునకై సహకరించవలసిందిగా పెద్దల సమావేశములలో విజ్ఞప్తి చేశారు. డాక్టర్ జీ, గురూజీ వంటి మహనీయులు కార్య రచన చేశారని, యావద్భారతములోను అత్యంత యోగ్యమగు కార్యకర్తాగణము వ్యాపించియున్నదని, దేశమున సర్వత్రా సంఘ కార్యమునకు అనుమోదము స్పష్టంగా కనిపిస్తున్నదని-ఈ దృఢమైన పునాదులపై ఈ కార్యము సఫలమై తీరగలదని విశ్వసిస్తున్నామని స్పష్టం చేశారు. ప్రశ్నలాహ్వానించి సమాధానము లిచ్చారు. పూజ్య శ్రీ గురూజీ లేనిలోటువల్ల జిజ్ఞాసలో నున్న పెద్దలు - సమర్థుడగు మరియొక నేత లభించిన సంతృప్తిని, ఆనందాన్ని వ్యక్తం చేశారు.

వారి ప్రసంగముల, ప్రశ్నోత్తరముల క్రోడీకరణ ఈ పుస్తకమున అందీయడం జరుగుతోంది. శ్రీ బాలా సాహెబ్ స్వీకరించినది, ప్రబోధించినది విజయనిష్ఠ. వారి గమనము విజయపథమున. నిశ్చిత గమ్యము విజయము.

—ప్రకాశకులు

# విజయపథము

పరమపూజనీయ శ్రీ గురూజీ మనలను విడచివెళ్ళినపిమ్మట సంఘబాధ్యత నాపై పడింది. నేను వెంటనే ఒకసారి అన్ని ప్రాంతాలలో పర్యటించవలెనని మన ప్రముఖకార్యకర్తలు సూచించారు. ఆ ప్రకారము నేను విదర్భ, మహారాష్ట్ర, గుజరాత్, రాజస్థాన్, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్ ఢిల్లీ, పంజాబ్. హరియానా ప్రాంతాలలో పర్యటించి ఈ ప్రాంతానికి వచ్చాను.

## స్వయంసేవకుల జిజ్ఞాస

ఈపర్యటనలో స్వయంసేవక్ సోదరులు, ఆహ్వానితులకోసం కార్యక్రమాలు జరుగుతున్నచోట వారు, మంచిసంఖ్యలో రావడం కనిపిస్తోంది. దీనికి కారణము మనం అర్థంచేసుకోవచ్చు. కొత్తగా బాధ్యత స్వీకరించిన వీరిని చూద్దాం, గమనిద్దాం అనే కుతూహలంకావచ్చు. అది సహజమే. ఆ జిజ్ఞాసతోపాటు, ఈయన సంఘకార్యాన్ని చక్కగా నిర్వహించగలుగుతాడా అనే సందేహంకూడా కొందరికి ఉండడంకద్దు. ఎందుకంటే, సంఘానికి మొదటి సర్ సంఘచాలక్, సంఘసంస్థాపకులైన డా॥ హెడ్గేవార్ జీ. రెండవ సర్ సంఘచాలక్ శ్రీగురూజీ. వారితోపోల్చిచూచినమీదట, ఈమూడవవ్యక్తి ఎట్లా కార్యనిర్వహణ చేయగలరా అనే ఆలోచనరావడం సహజం. డాక్టర్జీ

వ్యక్తిత్వము ఎంత ఉన్నతమో మనకు తెలుసు. సంఘమువంటి భవ్య కల్పన చేసినది వారు. ఆ కల్పన సాకారంకావడానికి వారొక అపూర్వపద్ధతిని ఏర్పరిచారు. తన జీవితకాలంలో సంఘకార్యానికి అఖిలభారతవిస్తృతి కల్గించారు. పైగా వారొక ద్రష్ట, సంఘటనా కుశలురు. వారి తరువాత శ్రీ గురూజీవచ్చారు. గత 32, 33 సంవత్సరాలలో సంఘంకోసము గురూజీ ఏమి చేశారో అందరమూ చూచాం. భారతదేశమంతటా సంఘకార్యాన్ని ఎంతటి భవ్యరూపంలో నిలిపారో, కష్టాలు వచ్చినప్పుడు వారు ఎంత దృఢంగా, నేర్పుతో నిలచి ఎలా మార్గదర్శనంచేశారో ఈ విషయాలన్నీ మనకుతెలుసు. అట్టి ఆద్య సర్ సంఘచాలక్ డాక్టర్ హెడ్గేవార్, శ్రీగురూజీల తరువాత నావంటిసామాన్యుడు ఆస్థానములోనికిరావడం కొంత ఆశ్చర్యమే కలిగిస్తుంది.

## సమస్త బాధ్యత

నేనుకూడ సంఘంలో కొంత పనిచేసినమాట నిజమే. బాల్యములోనే సంఘంలోకి వచ్చాను. సంఘంలో ఉండే రకరకాల పనులు, గటనాయక్, గణప్రముఖ్, ముఖ్యశిక్షక్, కార్యవాహ్, నగర కార్యవాహ్, సర్ కార్యవాహ మున్నగునవి అన్నీ నిర్వహించాను. బహుశా సంతృప్తికరంగాకూడా చేసిఉండవచ్చు. అందుచేత డాక్టర్‌జీ, అటుతర్వాత శ్రీ గురూజీల దృష్టి నావైపు మళ్ళి ఉండవచ్చు. అయితే ఆ బాధ్యతలన్నీ వ్యవస్థా నిర్వహణకు సంబంధించినవి. కాని ఇప్పుడు వచ్చినది సమస్తసంఘకార్య బాధ్యత. దీనివిషయంలో నేను ఎంతవరకు కృతకృత్యుణ్ణి కాగలననేది అందరితో పాటు నాకుకూడా కలిగే ప్రశ్నయే.

అప్పుడప్పుడు తమాషాకు శ్రీ గురూజీతో నన్ను పోల్చుకుంటుంటాను. శ్రీగురూజీ చాలమంచివిద్యార్థి, పరీక్షలన్నీ అతిసులభంగా ఉత్తమశ్రేణిలో

నెగ్గేవారు. నేనూ మంచివిద్యార్థి నే. ప్రథమశ్రేణిలో నెగ్గడం నాకుకూడ కష్టమయ్యేదికాదు. అయితే గురూజీకి, నాకు ఒక పెద్ద తేడాఉంది. ఏదైనా అధ్యయనం చేసేటప్పుడు గురూజీ మూలగ్రంథాన్ని తీసుకుని పూర్తిపరిజ్ఞానం సంపాదించి ఉత్తమశ్రేణిలో కృతార్థులయ్యేవారు. ఇక నేను నోట్సులు, గైడ్లు, మొదలైనవిచదివి, ఉత్తమశ్రేణిలో కృతార్థుడ నయ్యేవాడివి. గురూజీకి నాకు ఉన్న అంతర మింతటిది. అయినా నాపై ఇంతటి బాధ్యతరావడం విధి నిర్ణయం అనుకోవాలి. నా కీబాధ్యత వప్పగింపబడడానికి ఒక కారణము సంఘకార్యకర్తలలో నేను కొంత జ్యేష్ఠుడ నవడం కావచ్చు.

కారణమేదైనా నాపై ఈబాధ్యత వచ్చింది. వప్పగించబడినబాధ్యతను నెరవేర్చడం మనకు సంఘంలో పరిపాటి. మరి ఈ బాధ్యతను మనం నెరవేర్చగలమా ? అని నాకు, మీకు కూడ అనిపించవచ్చు. మనమంతా కలసి కృషిచేస్తే తప్పక సఫలురం కాగలమనే నాకనిపిస్తుంది. ఇందుకు బలమైన కారణాలున్నాయి.

## సంఘకార్యం 'వ్యక్తి నిరపేక్షం'

అన్నిటికంటే ముఖ్యకారణము మన సంఘకార్యము వ్యక్తి నిరపేక్షము కావడం. 1973 ఏప్రిల్ 25 తేదీన శ్రీ గురూజీ మనకోసం మూడు ఉత్తరాలు వ్రాసిఉంచారు. ఒక ఉత్తరములో సంఘకార్యము రాష్ట్రపూజకం, ధ్యేయపూజకము, ఏవ్యక్తినికూడ పూజించేదికాదు అని వ్రాశారు. తమ జీవితకాలములో వారు ఆ విధంగానే పనిచేశారు. వారు మనముందు ఎప్పుడూ రాష్ట్రాన్ని, ధ్యేయాన్ని ఉంచారు. తమనుకూర్చి వారు ఎన్నడూచెప్పుకోలేదు. ఈ కార్యము దేశపు నలుమూలలకు విస్తరించి రాష్ట్రంకోసం నిలచేందుకే వారు సమస్త కృషినీ చేశారు. తనదిగా ఏదోఉండాలనే భావనే వారిమనస్సులో లేదు. వారు వ్రాసిపెట్టిన లేఖలో తమ మరణానంతరం తమ పార్థివదేహానికి

ఎలాంటి అలంకారాలూచేయవద్దనీ, తమకై ఎలాంటి స్మారకాలూ నెలకొల్పే ప్రయత్నాలు చేయకండనేంతవరకు తమ అభీష్టాన్ని ప్రకటించారు. తాము జీవించి ఉండగానే తమ విగ్రహాలు పెట్టించుకునే ఈ రోజుల్లో వ్యక్తులు తమ దేహానికి అలంకారాలు సైతం చేయవద్దనేంతగా వారు ఆదర్శాన్ని ప్రతిపాదించారు. సంఘకార్యం ఎంతగా వ్యక్తినిరపేక్షమో తద్వారా మనకు బోధించారు. ఆవిధంగానే జీవితమంతా సంఘకార్యం చేశారు.

ఆద్య సర్‌సంఘచాలక్ డాక్టర్ హెడ్‌గేవార్‌జీ ఆలోచనలు కూడా ఇలాగే ఉండేవి. ఈనాడు సమాజంలో ఎటువంటి వ్యక్తిని మంచి కార్యకర్త అంటుంటారో మీకు తెలుసు. ఒకరు కొత్తగా పని ప్రారంభించి, త్వరలో ప్రగతి సాధిస్తారు. కొన్నిరోజులతర్వాత అతడక్కడనుండి వెళ్ళిపోగానే ఆపని ఆగిపోతుంది. అప్పుడు ప్రజలు "ఆయన ఎంత మంచి కార్యకర్త. ఆయన ఇక్కడ ఉన్నంతవరకు పని ఎంతబాగా జరుగుతూ ఉండేది. ఇప్పుడు ఆయన వెళ్ళిపోయాడు, పని ఆగిపోయింది" అని అంటుంటారు. కాని డాక్టర్‌జీ మరొకలా చెప్పేవారు. 1940లో సంగతి చెప్తాను. అప్పటిలో ప్రచారకులు నాగపూర్‌నుండి దేశములోని వివిధ ప్రాంతాలకు వెళ్ళేవారు. వాళ్ళను పంపుతూ ఉండడమూ, అవసరమైనప్పుడు మార్చుతూ ఉండడము మొదలైన పనులన్నీ నాగపూర్ కార్యవాహ్‌గా నా బాధ్యత. డాక్టర్‌జీ ఫలానా ప్రచారక్‌ను ఆ ప్రాంతంనుండి మరొక ప్రాంతమునకు పంపమని సలహా యిస్తుండేవారు. నేను డాక్టర్‌జీతో ఈ ప్రచారక్ మంచి కార్యకర్త, సమర్థుడు. ఎంతో పనిచేశాడు. అతనిని మరియొకచోటికి పంపితే ఆపని నిలిచిపోతుంది. అతడు అచటనే ఉండడం అవసరం" అంటూ ఉండేవాడిని. దానికి డాక్టర్‌జీ 'అది పొరపాటు' అని చెప్పేవారు. ఏ కార్యకర్తకూడ తన క్షేత్రములో తనను తాను అనివార్యునిగా చేసుకోరాదు. తనను వేరేచోటికి పంపితే ఏమౌతుంది అని అతనిని అడిగితే

"నన్ను ఎక్కడకైనా పంపండి. నేను వెళ్ళిపోయినతర్వాతకూడ యిక్కడ పని చక్కగా సాగుతుంది" అని అతను చెప్పగలగాలి. సంఘ పరిభాషలో యిటువంటి కార్యకర్తయే కుశలుడైన కార్యకర్త. ఇదీ డాక్టర్‌జీ మనకు నేర్పినది. ఆవిధంగా డాక్టర్‌జీకూడ సంఘకార్యాన్ని వ్యక్తి నిరపేక్షముగా నెలకొల్పారు. 1940 లో డాక్టర్‌జీ పరమపదించినపుడు దేశానికి సంఘ కార్యము ఇంకా కొత్త. అయినా డాక్టర్‌జీ వెళ్ళిపోయినతర్వాత గురూజీ ద్వారా ఈ కార్యవిస్తరణ జరిగింది. దీనికి గురూజీ కర్తృత్వశక్తి ఒక కారణము. దానితోపాటు సంఘము వ్యక్తినిరపేక్షము కావడము కూడ కారణమే.

## "దేవదుర్లభ కార్యకర్తాగణం"

మరొక కారణముకూడా ఉన్నది. ఈనాడు సంఘములో ఎందరో మంచి కార్యకర్తలు ఉన్నారు. ఇంత మంచి కార్యకర్తలు, యింత అధికసంఖ్యలో లభించడమనే భాగ్యము ఏ యితర సంస్థకు లేదు. మన కార్యకర్తల సముదాయాన్ని "దేవదుర్లభము", దేవతలుకూడా అసూయ పడతగినది అని నేను అంటాను. ఇలాంటి కార్యకర్తాగణము లభించడం కాకతాళీయము కాదు. దీనికోసము గురూజీ, డాక్టర్‌జీలు శ్రమించారు. గురూజీ పర్యటనల్లో కేవలం ఉపన్యాసాలు మాత్రమే ఉండేవికాదు. ప్రతి చోట కార్యకర్తల సమావేశాలు గంటలతరబడి జరిగేవి. అందులో ఎన్నెన్నో ప్రశ్నలు, జవాబులు, నవ్వులు, హాస్యప్రసంగాలు కథలు వస్తుండేవి. ఈవిధంగా దేశమంతటా గురూజీ శ్రద్ధతో కార్యకర్తల సముదాయాన్ని నిర్మాణము చేశారు. డాక్టర్‌జీకూడ అలాగే చేసేవారు. అప్పట్లో మాకు చిన్నచిన్న పనులు అప్పగించబడేవి. పని బాగాచేస్తే ''భలే నీవు పని బాగా చేశావు యిలాగే చెయ్యి' అంటూ ప్రశంసించేవారు. ఎప్పుడైనా ఏదైనా

పొరపాటు జరిగితే ''నీవెంత మూర్ఖుడవు. నీకు పనిచేయడం తెలియదు'' అంటూ ఎన్నడూ విమర్శించేవారు కాదు. "ఫరవాలేదు. పొరపాట్లు అందరికీ జరుగుతాయి. ఇకముందు జాగ్రత్తతీసుకో'' అంటూ ఉత్సాహపరిచేవారు.

*పరగుణ పరమాణూన్ పర్వతీకృత్య నిత్యమ్*
*నిజహృది వికసంతః సన్తి సంతః కియంతః॥*

అని సత్పురుషుల వర్ణణ వినివుంటారు. యితరులలో పరమాణువులలాగ వుండే చిన్నచిన్న సుగుణాలను కొండంతలుగాచేసి ప్రోత్సహిస్తారు సత్పురుషులు. డాక్టర్జీ గురూజీలతో మా అనుభవము యిలాగే ఉండేది. ఈ విధముగా కార్యకర్తలకు మార్గదర్శనముచేస్తూ భారతదేశమంతటా వారు ఉత్తమ కార్యకర్తలను బహుళసంఖ్యలో నిర్మాణము చేశారు.

## సంఘకార్యానికి ప్రజలలో ఆమోదం

మూడవకారణముకూడ ఉన్నది. మనం అప్పుడప్పుడు సమాజములో సంఘానికి ఎంతో వ్యతిరేకత ఉందనుకుంటుంటాము, అప్పుడప్పుడు గురూజీభావాలు వివాదాస్పదాలని అనిపించడంకూడా కద్దు. కాని గురూజీ మరణానంతరము దేశమంతా వారికి అర్పింపబడిన శ్రద్ధాంజలిని గమనిస్తే ఎంతో ఆశ్చర్యంకల్గుతుంది. ఎందరో సంతాప సందేశాలు పంపారు. ప్రసంగాలుచేశారు. పత్రికలో వ్యాసాలు ప్రకటించారు. వీటన్నిటినీ చదివి నప్పుడు గురూజీ విషయంలోను, వారు నిర్వహించిన సంఘటన విషయంలోను, ప్రజలలో ఎంత అనుకూలత, ఆమోదము, సానుభూతి ఉన్నదీ అర్థమవుతుంది. ఆంధ్రలోని విషయమే ఒకటి ఉదాహరిస్తాను. రాజధానినుండి వెలువడే దినపత్రిక ఒకటి సంపాదకీయం వ్రాసింది. అందులోఒకవిషయాన్ని

ప్రస్తావించింది. గురూజీకి శ్రద్ధాంజలిఘటిస్తూ కొందరు ప్రముఖులు 'గురూజీతో తమకు అభిప్రాయబేధాలున్నప్పటికీ వారు మహావ్యక్తి' అంటూ పలికారు. అలా అనవలసిన అవసరమేమిటని ఆ పత్రిక ప్రశ్నించింది. ఎవరైనా ముస్లిం క్రైస్తవాదులు మరణించినప్పుడు సంతాపసందేశాలలో ఇలాగే విబేధాల ప్రస్తావన తీసుకువస్తారా? కాని ఒక హిందూనాయకుడు, సంవత్సరాల తరబడి నిర్విరామంగా పనిచేసిన ఒక మహనీయుని విషయంలో ఇలా ఎందుకు ప్రస్తావించవలసివచ్చింది? అంటూ ప్రశ్నించిందాపత్రిక. ఈ విధంగానే దేశమంతా గురూజీకి, సంఘకార్యానికి సంబంధించి స్పష్టమైన అంగీకార భావనను మనం గమనిస్తాం.

వ్యక్తి నిరపేక్షమైన మహత్కార్యము, దేవతలు సైతముఅసూయ చెందదగు యోగ్యకార్యకర్తలు అధికసంఖ్యలో ఉండడము, సమాజమంతటా అంగీకారామోదములతోకూడిన అనుకూల వాతావరణము - కలిసి సంప్రాప్తించినప్పుడు ఇక సర్ సంఘచాలక్ ఎవరనేదానికి విశేషప్రాముఖ్య ముండదు. అందువల్లనే మన మీకార్యమును సఫలము చేయగలమనే ప్రబల విశ్వాసం నాకున్నది.

ఈ కార్యాన్ని ముందుకు తీసుకొని వెళ్ళటానికి అవసరమైన సంసిద్ధత, దక్షత, పాత్రత మనలో ఏర్పరుపబడి ఉన్నాయి. ఎన్నో సంవత్సరాలుగా డాక్టర్‌జీ గురూజీలతో కలసి పనిచేయడమువల్ల మనకు ఆదృష్టి సంపూర్ణముగా అలవడింది. ఏమనుష్యుడైనా, అతడెంత ప్రముఖ వ్యక్తి అయినా శాశ్వతుడు కాడు. ఏదో ఒకనాడు అతడీ లోకమును వీడక తప్పదు. అప్పుడు ఆయనతో కలసి పనిచేసిన వ్యక్తులు ఏమౌతారు ? నిరాశతో నిష్క్రియతో కూలబడిపోతారా ? ఈ విషయాన్ని గురించి డాక్టర్‌జీ ఒకసారి శాఖలో ప్రస్తావిస్తూ ఇలా అన్నారు: కొంత

మంది తాము ఫలానా నాయకుని అనుయాయులమని, ఆయన అడుగు జాడలలో నడవడమే తమకు తెలుసుననీ అంటుంటారు. అడుగుజాడలలో నడవడమంటే ఏమిటి? నాయకుడు నేడో రేపో చనిపోయేవాడేకదా! అప్పుడు కనిపించేది ఆయన చివరి అడుగుజాడమాత్రమే. ఇక ఆతర్వాత అడుగులు కనిపించవు. అపుడు మీరేమిచేస్తారు? అక్కడేకూలబడతారా? లేక తిరిగి వెనక్కు వెళ్ళి అక్కడనుండి మరల బయల్దేరి అదే అడుగు జాడలో మీకు కనిపించినంతమేర నడుస్తూ ఉంటారా? అలా జరుగరాదు. అడుగుజాడలలో నడవడమనేది కేవల మొకమాటవరుస. దాని అర్థము-మనమానేతతో కలిసిపనిచేశాము. మనకు దృష్టి లభించింది. భావన లభించింది. అనుభవం కల్గింది. మార్గము దొరికింది. ఇక వారి తరువాత మనబుద్ధిని ఉపయోగించి, సమయానుకూలముగా మార్గమును గుర్తిస్తూ ముందుకు సాగివెళ్ళాలనేదే. అంతేగాని అడుగులో అడుగువేసుకుంటూ అక్కడే తిరగడం కాదు. డాక్టర్‌జీ చెప్పినదాని సారాంశమిది. గురూజీ సైతం మనందరికీ ఇలాంటి తయారీ నిచ్చారు. అట్టిశక్తి, ఓర్పు, పాత్రతకల్గించారు. అందువల్ల మనం తప్పక సంఘకార్యాన్ని ముందుకు తీసుకువెళ్ళగలం.

## ఇది హిందురాష్ట్రం

అయితే ఈ కార్యస్వరూపము ఎటువంటిది? డాక్టర్‌జీ, గురూజీలు మనకు చెప్పినదేమిటి? ఇది హిందూరాష్ట్రము, ఈ హిందూరాష్ట్రములో హిందువులను సంఘటితపరచాలని స్పష్టముగా ప్రారంభమునుండే చెప్పారు. డాక్టర్‌జీ ఈ భావాన్ని ప్రకటించినపుడు మొదట్లో కొందరు "యిది హిందు రాష్ట్రము ఎట్లా అవుతుంది? యిది పిచ్చివాళ్ళ ఆలోచన'' అనేవారు. కాని డాక్టర్‌జీ చలించకుండా కృషిచేశారు. ఆతరువాత అనేకమంది ఈ భావాన్ని అంగీకరించారు. వారు చనిపోయినతర్వాత శ్రీ గురూజీకూడ భారతదేశ

మంతా పర్యటిస్తూ అత్యంత స్పష్టముగా, అసందిగ్ధముగా యిది హిందూ రాష్ట్రమని చెప్పారు. ప్రారంభములో పలువురు ఆయనను అపార్థంచేసుకునే వారుకూడా. అయినప్పటికీ ఆయన స్పష్టంగా ఈవిషయాన్ని ప్రకటించారు. హిందుత్వం అంటే ఏమిటో? ఎంతటి భవ్యమైనదో, ఏవిధముగా యితరులకు వ్యతిరేకము కాదో, మానవాళి హితముకోసముకూడ ఎట్లా పనిచేస్తుందో వీటినిగూర్చి తమ పైదుష్యపూర్ణ ప్రసంగములలో చర్చలలో అందరికీ చెప్పారు. అందుచేత ఈ దేశములో మేధావివర్గము ఇది హిందూరాష్ట్రమనే వాస్తవాన్ని అంగీకరింపసాగింది. మనము ఈ భావాన్ని అర్థముచేసుకొని ముందుకు వెళ్ళాలి. ఈ భావాన్ని అందరికి మనముకూడ అర్థమయ్యేటట్లు చేయగలమను విశ్వాసము మనకుండాలి.

మన జాతీయ జీవనము ఆంగ్లేయులు వచ్చినతర్వాతనే ఆరంభమైనదని భావించే సోదరులు కొందరుండవచ్చు. వారికి నచ్చచెప్పడము కష్టము కావచ్చు. కాని ఇక్కడ వేలసంవత్సరాలనుండి, పురాతన, సనాతన రాష్ట్రజీవనము వస్తూఉన్నదనీ అంగీకరించేవారు అది హిందూరాష్ట్ర జీవనమనికూడా అంగీకరించక తప్పదు. కొన్నిదినాల క్రితము మనదేశ ప్రధానమంత్రి శ్రీమతి యిందిరాగాంధి రామేశ్వరము వెళ్ళింది. అక్కడ ఆలయములో యథావిధిగా పూజలు జరిపించింది. వెలుపలికి వచ్చినతరువాత పత్రికావిలేఖరులు ఆమెను అనేక ప్రశ్నలు వేశారు. వానికి సమాధానంగా ఆమె ''రామేశ్వరము ఐక్యతకు చిహ్నమని నేను భావిస్తాను'' అన్నది. ''ఈ ఐక్యత ఏమిట''ని వారు ప్రశ్నించగా ఆమె "నేను దానిని యిండియన్ నెస్ అంటాను" అన్నది. ఇదంతా పత్రికలలో వచ్చినదే. ఈ మాటల తాత్పర్యమేమిటి ? యిండియా - యిండియన్ - యిండియన్ నెస్ అనే

మాటల వాడుక ఈదేశములో ఆంగ్లేయులు వచ్చినతరువాత ఆరంభ మైనట్టిది. కాని రామేశ్వర దేవాలయము వేల సంవత్సరాలుగా నిలచి ఉంది. అప్పటినుండి యాత్రాదికములు జరుగుచునే ఉన్నాయి. వేల సంవత్సరాలనుండి రామేశ్వర మందిరాన్ని ఐక్యతాచిహ్నముగా భావించే ప్రజలుకూడ యిక్కడ వున్నారు. కాబట్టి యిక్కడ ఉన్న పురాతన జీవన ప్రవాహము హిందూరాష్ట్ర జీవన ప్రవాహమేనని ఎవరైనా అంగీకరించక తప్పదు. దానిని యిండియన్ అన్నా భారతీయ అన్నా, హిందు అన్నా మాటలకోసం వివాద పడనవసరములేదు. దాని కర్థము ఒక్కటే – వందల వేల సంవత్సరాలనుండి ఈదేశంలో ఒక రాష్ట్రజీవనము సాగివస్తున్న దనేది.

అయితే రెండుమూడువేలసంవత్సరాలముందు ఉన్న జీవనమే నేడు కూడ ఉన్నదని ఎవరూ అనలేరు. బయటనుండి అనేకమంది వచ్చారు. వారు మనకు కొంత యిచ్చారు. మనము వారికి కొంత యిచ్చాము. ఈవిధంగా అనేకమార్పులు వచ్చాయి. మన వ్యవస్థలో అనేకములైన దోషాలుకూడ ఏర్పడినాయి. వికృతులూ కలిగాయి. అయితే యిక్కడ ఎందరో మహా పురుషులు, సాధుపుంగవులు ఉద్భవించి ఎప్పటికప్పుడు ఈ వికృతులను తొలగించటానికి కృషిచేస్తూ వచ్చారు. ఈ విధముగా జరుగుతూ ఈ దేశ జీవితంలోని అన్ని రంగాలలోను ఒకే దృక్పథము, ఒకే స్వభావముకల అఖండ సామాజిక జీవనప్రవాహము సాగుతూవచ్చింది. యిటువంటి జీవన ప్రవాహము ఈనాడుకూడ సాగుతునే ఉన్నది. దీనినే మనము హిందూరాష్ట్ర జీవనము అంటాము. ఇదీ వాస్తవం. అందుచేత యిది హిందురాష్ట్రమని స్పష్టము. ఇక్కడొక పురాతన రాష్ట్రజీవనమున్నదని అంగీకరించేవారు అది హిందురాష్ట్రజీవనమనికూడా అంగీకరింపకతప్పదు.

## హిందువుల ఐక్యత ముఖ్యావసరం

ఈ హిందురాష్ట్రములోని హిందూ సమాజమును సంఘటితపరచవలె ననేది మన ఉద్దేశ్యం. ఇలా అనగానే-మరి ముస్లిముల క్రైస్తవుల విషయ మేమిటి అంటుంటారు కొందరు. ఈ దేశములో సమస్య ముస్లిములుకాదు క్రైస్తవులుకాదు. ఇక్కడి ప్రధానసమస్య హిందువులే. హిందువుల సంఘటనము జరిగితే యిక్కడ ముస్లిముల, క్రైస్తవుల సమస్యలు వాటంతట అవే పరిష్కారమైపోతాయి. నేడు హిందువు దుర్బలుడు. రాజకీయ స్వార్థాల మూలకముగా భాషా, ప్రాంత, కులాలమూలకంగా చీలిపోయి సమాజమంతా బలహీనంగా ఉన్నది. కాబట్టే ముస్లిం, క్రైస్తవుల సమస్యలుకూడా యిక్కడ ఏర్పడినాయి. ఒకభాష మాట్లాడే హిందువులు తమలోతాము పోట్లాడుకొంటున్నారు. అయితే అదేభాష మాట్లాడే ముసల్మాన్, క్రైస్తవ సోదరులు తమలోతాము పోట్లాడుకోరని మీకుతెలుసు. ప్రస్తుతము కన్నడిగలూ, మహారాష్ట్రులమధ్య పోట్లాటజరుగుతున్నదని వార్తాపత్రికలలో చూస్తున్నాము. అక్కడ పోట్లాడుకొంటున్నది హిందూ సోదరులేనని, కన్నడము మరాఠీ మాట్లాడే ముస్లిములు, క్రైస్తవులు ఎప్పుడూ పోట్లాడు కోరని మీకుతెలుసు. వారి మనస్సులలో తాము క్రైస్తవులము లేదా తాము ముస్లిములము అనే భావము ప్రధానముగా ఉన్నందున వారు ఎపుడూ పోట్లాడుకోరు. హిందువులమైన మనపై మొత్తం దేశంయొక్క బాధ్యత ఉన్నదని, హిందువుగా మనం ఆలోచించాలనీ. ఈ దేశాన్ని సంఘటితము చేయాలనీ-ఇలాంటిభావాలు హిందువులలో లేనికారణముచేత నే ఈదేశములో అనేకరకాలసమస్య లేర్పడినాయని గుర్తించాలి. హిందువులు సంఘటిత మైతే, ఈ భేదాలను అధిగమిస్తే ఈ దేశమంతా తమదేనని గుర్తిస్తే - ముస్లిములు క్రైస్తవులుకూడ 'మేము మాత్రం ఆఫ్ఘనిస్థాన్‌నుండి వచ్చామా? ఇరాన్‌నుండివచ్చామా? ఇంగ్లాండునుండివచ్చామా? మేమూ ఈదేశవాసులమే,

మీ సోదరులమే. కొన్నితరాలకుపూర్వము మాకు మతపరివర్తనము జరిగింది. అయినా మేమూ మీరూ ఒకటే. మునిగినా ఈదినా కలిసికట్టుగానే ఉందాము.' ఈ విధముగా ఆలోచించుతారని తెలుసుకొనగల్గుతాం.

## మనది అఖిల భారత దృష్టి

మన హిందూ సంఘటనభావం సంకుచితంకాదు. వర్గతత్వమూకాదు. గురూజీ మరణానంతరము ఎందరో శ్రద్ధాంజలి అర్పించారు. అందు సర్వోదయనాయకులు వినోభాభావే, జయప్రకాశ్‌నారాయణ్, దాదాధర్మాధికారి ప్రభృతులుకూడా ఉన్నారు. సర్వోదయవాదులు మానవాళి దృష్టితో ఆలోచిస్తారు. అటువంటి ఈ ముగ్గురుపెద్దలూ గురూజీకి శ్రద్ధాంజలి అర్పిస్తూ "మేము గురూజీని ఎరుగుదుము. వారిని కలుస్తుండేవాళ్ళము. వారితో చర్చిస్తుండే వాళ్ళము. గురూజీయొక్క ఆలోచన సంకుచితముకాదు. ఏమతానికీ విరుద్ధముకాదు. అన్ని సాంప్రదాయాలను అనుసరించేవారు యిక్కడ రాష్ట్ర జీవనములో కలిసిపోవా లనేవారు" అన్నారు. అంతేకాదు. నాగపూర్‌లో గురూజీకి శ్రద్ధాంజలి అర్పించేసభలో దాదా ధర్మాధికారి ప్రసంగిస్తూ ''భారతదేశములో నేడు ఉత్పన్నమయ్యే రకరకాల ప్రశ్నల విషయములో అఖిలభారతీయ దృక్పథముగల ఏకైక నాయకుడు ఎవరైనా వుంటే ఆయన శ్రీ గురూజీయే'' అన్నారు. భాషాప్రయుక్త ప్రాంతాల నిర్మాణ సమయములో, సరిహద్దుల తగాదాలు ఏర్పడినప్పుడు తమనుగూర్చి ఎవరికి ఏ అపోహలు కలిగి, ఏ విధముగా విమర్శించినా పట్టించుకొనకుండా శ్రీ గురూజీ పంజాబు విషయములోగాని, బెల్గాం విషయములోగాని మరే విషయంలోగాని తమ భావాలను స్పష్టముగా చెప్పేవారు' అని ఆ సభలో దాదా ధర్మాధికారి అన్నారు. అది నిజం. ప్రతి విషయాన్ని అఖిలభారతీయ దృష్టితో చూడు. అల్పమైన ఆలోచనలు చేయకు, అని ఎప్పుడూ చెప్తుండే వారు గురూజీ.

ఆంధ్రప్రదేశములో రెండు ప్రాంతము లుండాలా? ఒకటియేఉండాలా అనే వివాదం ఇక్కడ ఇప్పుడు కనిపిస్తుంది. అఖిల భారతీయ దృష్టిని వీడనంతవరకు ఎలా నిర్ణయించుకున్నా పర్వాలేదు. ఒక భాషకు ఒకే ప్రాంతముండాలనీలేదు. హిందీ మాట్లాడే భాగంలో నాలుగైదు ప్రాంతాలను చూస్తూన్నాం. ఆంధ్ర ఒకేప్రాంతంగా ఉండాలనుకునే వారు అందుకై గట్టిగా నిలబడనూవచ్చు. కాని- అఖిల భారత దృష్టి అనేది లేకుండా, కేవలం తమపార్టీని, తమ పదవులను, ప్రతిష్ఠలను గురించి ఆలోచిస్తూ- ఏజిల్లావాళ్ళకు ఆ జిల్లాల్లోనే పదవులు,-అనేమాదిరి జిల్లాలవారీ మనస్తత్వాన్ని వ్యాప్తిచేయడం ఏమియోగ్యం ? 'మన జిల్లానుగురించే ఆలోచిద్దాం; ఇక్కడ ఉన్నదంతా కేవలం మనదేకావాలి; ఉద్యోగాలు మనకే పరిమితం కావాలి; ఇక్కడి నీరు మనకే ఉండాలి; ఇక్కడి ఉత్పత్తులు మనకే వినియోగం కావాలి;'-ఇలాంటి ఆలోచనాసరళి యోగ్యం కాజాలదు. బొగ్గుగనులు గల ఒక జిల్లా - అరబ్బులు పెట్రోలు అదుపుచేసినట్లు - బొగ్గు రవాణా అదుపులు ఆరంభిస్తే ఇక ఈ దేశము ఏమవుతుంది ? అఖిల భారత దృష్టి కొరవడినవారు ఇలా విశాలభావంతో ఆలోచించలేకపోతున్నారు.

కాని సంఘానిది విశాలభావన. మన హిందూరాష్ట్రభావన, హిందూ సంఘటనభావన అఖిలభారతీయము. దేశమంతటిని గూర్చి మనము ఆలోచిస్తాము. మన కార్యము సిద్ధాంతపరంగాగాని, వ్యవహారదృష్టితోకాని సంకుచితము కాదు అనే అవగాహన మనకు కలగాలి. ఈ దేశములో హిందూసంఘటన అత్యంత యోగ్యము, ఆవశ్యకము అని మనం గ్రహించాలి.

## సంఘటిత సమాజమే దేశానికి బలం

అయితే అసలు సమాజ సంఘటన ఎందుకు ? సమాజము సంఘటితము కానంతవరకు దేశము శక్తివంతము కాజాలదు. దేశము శక్తి

వంతము కావడమంటే గట్టి ప్రభుత్వము ఉండడమని కొందరు భావిస్తూ వుంటారు. దేశాన్ని శక్తిశాలి చేయడమంటే సైన్యాన్ని శక్తిశాలిగా ఉంచడము అని కొందరు తలపోస్తుంటారు. యిది సరికాదు. దేశంయొక్క శక్తి ప్రభుత్వంలోకాని, సైన్యములోకాని ఉంటుందనడము కొంతవరకు మాత్రమే నిజం. ప్రభుత్వము తప్పక బలంగా ఉండాల్సిందే. సైన్యము కూడ ఉత్తమమైనదై ఉండాల్సిందే. అయితే ప్రజలనుబట్టే ప్రభుత్వములు ఏర్పడుతుంటాయి. అందువల్ల సమాజం ఎలా ఉన్నదనేది ముఖ్యవిషయ మవుతుంది. ప్రభుత్వము బలహీనముగా ఉండి, సైన్యము సంసిద్ధముగా లేని సందర్భములలోకూడ సమాజము బలంగా ఉంటే ఆ సమాజము దేశమునకు విజయాన్ని చేకూర్చగలదనేది మనం చరిత్రనుండి గ్రహించ గలం. రెండవ ప్రపంచయుద్ధము ప్రారంభమైనపుడు ఇంగ్లాండు ప్రధాన మంత్రి చేంబర్‌లేన్, ఆయన శాంతస్వభావుడు, యుద్ధానికి విముఖుడు. ప్రభుత్వము దుర్బలంగా ఉండేది. ఆరోజుల్లో ఇంగ్లాండుకు ఒక్క విమాన శతఘ్నికూడా లేదు. సైన్యమూ బలహీనంగానే ఉంది. అయినా సమాజబలం వల్ల చివరకు యింగ్లాండు విజయం సాధించగల్గింది. యుద్ధ సమయంలో నేతృత్వం వహించిన చర్చిలును యుద్ధానంతరం ఆ దేశపు పార్లమెంటు ఘనంగా వర్ణిస్తూ ఆయనను "ఇంగ్లాండు దేశపు సింహము" - అంటూ ప్రశంసించారు. అయితే చర్చిల్ వినమ్రభావముతో ప్రజానీకాన్ని ఉద్దేశించి ఇలా అన్నాడు. "సోదరులారా! నేను కాదు సింహాన్ని. మీారు. యిక నేను చేసిందల్లా మీా తరఫున గర్జించడం మాత్రమే. ఇదంతా మీా శక్తి యొక్క చలవ. ఇది మీా విజయం" అన్నాడు. దీనిని మనము గుర్తించాలి. సమాజముయొక్క బలమే దేశముయొక్క బలము.

మనకు స్వాతంత్ర్యమువచ్చి 25 సంవత్సరాలైంది. ఈ కాలములో కొంతప్రగతి సాధింపబడ్డది. అయితే అది మనకు తృప్తికరమైనంత ప్రగతి

కాదు. పాతికేండ్లుగా ప్రభుత్వాన్ని నడిపినపార్టీకూడా తృప్తిచెందలేక పోతున్నది. సాధించవలసినది ఎంతోమిగిలి ఉందని వారుకూడఅంటున్నారు. "ఏమిచెయ్యమంటారు ? పెద్ద సంఖ్యలో శరణార్థులు వచ్చారు. నాలుగు యుద్ధాలు చేయవలసివచ్చినది. మావ్‌సేటుంగ్ మోసముచేశాడు" ఇలాఅనేకం అంటుంటారు. ఇంకా ప్రజలను ఉద్దేశించి 'మీరేమీ చేయడంలేదు. మీరు ఇంట్లోకూర్చుని ఉంటే అంతా మేమే చేయాలా ?' అనికూడా అంటుంటారు. ప్రజల లోపాలు, ప్రతిపక్షాలదోషాలు, వర్షాలులేకపోవడము, యుద్ధాలు రావడము, శరణార్థుల సంఖ్య – ఈ విధంగా చెప్పుకొని విచారించడం కనిపిస్తుంది.

అటు ఇజ్రాయిల్‌ను గమనించండి. అది ఏర్పడి పాతికేండ్లే అయింది. వారిస్థితి ఎలాంటిది ? యూదులంతా శరణార్థులే. ఇక యుద్ధాల మాటా ? మొదటి రోజునుండి నేటిదాకా అనుదినము, అనుక్షణముయుద్ధమే. దేశ భౌగోళిక పరిస్థితి చూద్దామా అంటే అంతా ఎడారి. నదులూలేవు, వర్షాలు లేవు. ఇటువంటి ఎడారిలో జీవిస్తూ పోరాటముసాగిస్తూ, శరణార్థులసమస్యను పరిష్కరించుకొంటూ ఆదేశము అక్కడ నందనవనాన్ని సృష్టించుకున్నదని మనకు తెలుసు. అక్కడి సమాజము అలాఉంది. ప్రతియూదు పౌరుడు తన బాధ్యత గుర్తిస్తున్నాడు. అతనినుండి ఆశించే ఏపనినైనా నిర్వహించ డానికి ఏ క్షణములోనైనా సిద్ధంగా ఉంటాడు. మొన్నటియుద్ధంలో ఈజిప్టుకు ఉన్నస్థాయి సైన్యము 2,50,000, సిరియాసైన్యము 1,50,000 ఇక యిజ్రాయిల్ సైన్యము కేవలము 30 లేదా 40 వేలు మాత్రమే. కాని పూర్తిగా సైన్యాన్ని సమాయత్తం చేయవలసివచ్చేసరికి 48 గంటలలో ఇజ్రాయిల్‌కు రెండున్నరలక్షలసైన్యము తయారై నిలచింది. ఎలావచ్చారు? ఉపాధ్యాయులు, వకీళ్లు, రైతులు, డాక్టర్లు, స్త్రీలుసైతం సైనికరంగంలోకి దూకారు. శిక్షణపొందిన సైనికులకంటెకూడా చక్కగా యుద్ధంచేశారు. ఇటువంటిపౌరులు, ఇటువంటిసమాజము ఉన్నదేశానికి కొదువఏమిఉంటుంది?

## అభివృద్ధికిసైతం సమాజనిర్మాణం ముఖ్యం

మన దేశములో ఇటువంటి వ్యక్తులను, సమాజాన్ని నిర్మాణము చేయడము జరుగలేదు. అట్టికృషియే జరిగిఉంటే మనప్రణాళికలన్నీ ఫలించిఉండేవి. కాలువలు, కార్ఖానాలు, రహదారులు అన్నీ అవసరములే. ప్రణాళికలూ అవసరమే. అలా కోరుకొనడంలో తప్పులేదు. కాని అన్ని ప్రణాళికలకు ముఖ్యమైనది వ్యక్తి నిర్మాణము, సమాజ నిర్మాణము. వీనిని గురించి ఆలోచన జరుగలేదు. ఉన్నలోపమంతా ఇక్కడుంది. దేశం స్వతంత్రమైంది కాబట్టి – ప్రజలంతా సుసంఘటితులైపోయినారు, అందరికీ తమతమ బాధ్యతలు తెలుసు, అందరూ కష్టించి పనిచేస్తారు–అని అనుకొని సాగిపోయాము. దానితో ప్రణాళికల లెక్కలన్నీ తప్పులై కూర్చున్నాయి. అనేక ప్రణాళికలు పూర్తయిన తర్వాతకూడ, కోట్లకొలది రూపాయలు ఇతరచోట్లనుండి వచ్చినతర్వాతకూడ, జరుగవలసినంత అభివృద్ధి జరుగ లేదని మనము నేడు చూస్తున్నాము. కాబట్టి సమాజపరిస్థితి చక్కబడాలనేది సమాజంలో ఉండే బలమే దేశానికి బలమనేది అర్థము చేసుకోవాలి. డాక్టర్జీ గురూజీలిద్దరికి ఈ విషయము తెలుసు, కనుకనే ఈ విధమైన వ్యక్తి నిర్మాణము, సమాజ నిర్మాణము, తమ కర్తవ్యముగా భావించి నిరంతరంగా కృషిచేశారు.

## సంఘ శాఖద్వారా శక్తినిర్మాణం

ఈపని చేయడానికి సంఘం ఒక విశిష్టమైన కార్యపద్ధతిని స్వీకరించింది. అందు ముఖ్యమైనదిశాఖ. శాఖఉంటే అంతాఉన్నట్లే అని మన విశ్వాసము. అనేకులు సంఘపద్ధతిలో సంఘటన చేయాలి అనిఅంటుంటారు. కాని వారికి యిది సాధ్యంకావడములేదు. దీనికి కారణము – శాఖద్వారా సమస్తశక్తి లభిస్తుందనే మనఃపూర్వకమైన విశ్వాసం వారిలోలేదు. మనకు

వారికిగల తేడాయిది. మనవిజయానికి కీలకమిదే. మనమునడిపే దైనికశాఖ నుండి ఎంతోశక్తి లభిస్తుందని మనం మనస్ఫూర్తిగా విశ్వసిస్తాము.

శాఖలు పెద్దవిగా; ప్రభావం కలిగించేవిగా, ఎందరో స్వయం సేవకులతో నిండినవిగా ఉండాలి. 'శాఖకు వెళ్ళాను. చాలా మేలైంది'అని ప్రతి స్వయంసేవకునకు అనిపించేటట్లుండాలి. యింటికి వెళ్ళిన తర్వాత యింట్లోవాళ్ళుకూడా ఆనందించాలి. 'మా యింట్లో పెద్దలు, పిల్లలు శాఖకు వెళ్ళుతున్నారు. ఎంతో నేర్చుకొని వస్తున్నారు' అని ప్రజలు సంతోషించే టట్లు ఉండాలి. అటువంటిశాఖలు కావాలి. సంఘశాఖ తమ గ్రామమునకే శోభ అని ప్రజలు భావించేలా ఉండాలది. గ్రామస్థులకు శోభగాను, శక్తి గాను, ఇంట్లోనివారికి తమకు సంతోషదాయకంగాను, మంచి సంఖ్యతో, మంచి కార్యక్రమాలతో నడిచే శాఖలు అన్నిచోట్ల అవసరము. అన్ని తాలూకాల్లో, మండల కేంద్రాల్లో, గ్రామాల్లో అవి ఉండాలి. అందుకై మనం నిర్విరామంగా కృషిచేయాలి.

## కృషి వివిధరంగాలకు విస్తరించాలి

రెండవది : సంఘశాఖలో స్వయంసేవకులు పొందే సంస్కారాలు కేవలము శాఖవరకు మాత్రమే పరిమితం కారాదు. దానివలన ప్రయోజనం ఉండదు. సంస్కారము పొందిన స్వయంసేవకులు సమాజ జీవితంలోని అన్నిరంగాలలోకి ప్రవేశించాలి. తమపై ఉన్న సమాజ బాధ్యతను నెరవేర్చాలి. స్వయంసేవకులలో ఏదో విశిష్టత ఉన్నదని ప్రజలు అంటుంటారు. ఏపని తీసుకొన్నా దానిని విజయవంతంగా నిర్వహిస్తారని అంటారు. కేవలం ఇది చాలదు. ఇంతకంటె హెచ్చుసంఖ్యలో స్వయం

సేవకులు అన్నిరంగాలలోకి చొరవతో ప్రవేశించాలి. తాము ఇతర రంగాలకు వెళ్ళితే శాఖ ఏమవుతుంది అనే భయము ఎవరి మనస్సులలోనూ ఉండరాదు. సంఘశాఖ ఏమవుతుందో అనే సందేహంతో మనము వివిధ రంగాలలోకి ప్రవేశించకపోతే సంఘశాఖలు నిరర్థకంగానే ఉండిపోతాయి. సందేహ మనస్కులవల్ల, సాహసం, చొరవ లేనివారివల్ల ఎప్పుడూ ఏపనీ జరగదు. అప్పుడప్పుడు నేను ప్రభుత్వ అధికారులను, మంత్రులను కలుసుకొంటుంటాను. వారితో ఇలా అంటుంటాను : "ప్రభుత్వము ఏమంటుందో, మంత్రిగారు ఏమిచేస్తారో, వెళ్ళగొడతారేమో, ఉద్యోగమునుండి బర్తరఫ్ చేస్తారేమో, పని పోగొట్టుతారేమో, లైసెన్సు యివ్వరేమో, అప్పు యివ్వరేమో, ఎరువులు యివ్వరేమో ఈమాదిరి భయాలను మీరు ప్రజలలో కల్గిస్తున్నారు. ప్రజలను మీరు ఇలా పిరికివాళ్ళుగాను, ఇచ్చకాల మారివాళ్ళుగాను, మీ వందిమాగధులుగాను తయారుచేస్తే వారు ఏమి ఉపయోగిస్తారు ? ప్రజలలో పరాక్రమము, పరమార్థము ఉండాలని మీరు గుర్తిస్తున్నారా ?'' అంటుంటాను. పిరికితనం ఉండరానిది. పరాక్రమము, పరమార్థము ఉండాలి.

## తాను ఎండలో నిలిచి ఇతరులకు నీడనిచ్చే చెట్లవలె సేవచేయాలి

ఇతర రంగాలలో పనిచేస్తే వందలకొలది వ్యక్తుల పరిచయం కలుగుతుంది. వారిని సంఘములోనికి తీసుకొని రావాలి. యితరరంగాలలో ప్రవేసిస్తే అందలి దోషాలు తమకు అంటుకుంటాయని కొందరు సందేహిస్తూ ఉంటారు. వివిధరంగాలలో నేడు ఎంతోమురికి ఉన్నమాటనిజం. అవినీతి బంధుపక్షపాతము మొదలైనవి ఉన్నాయని ఆయారంగాలలోకి వెళ్ళినవాళ్ళ అనుభవములోకి వస్తుండడము నిజము. మంచిమాటలను గుర్తించేస్థితిలేని

మాటకూడా నిజం. ఈ మధ్యనే మహారాష్ట్ర పర్యటనలో సాంగ్లీవెళ్ళాను. అక్కడ ఒక పెద్ద అర్బన్ కో-ఆపరేటివ్ బ్యాంక్ ఉంది. మనసోదరులే కొందరు దానిని నడుపుతున్నారు. చాలమంచి బ్యాంకు అని పేరుపొందినది. అక్కడ డాక్టర్‌జీ, గురూజీ చిత్రపటాలు నేను ఆవిష్కరించడము జరిగింది. ఉపన్యశించేటపుడు ఈనాటిసహకార ఉద్యమాన్నిగూర్చి నేను కొన్నిభావాలు ప్రకటించాను. 'యితరరంగాలలోవలెనే సహకారరంగంలోకూడ స్వార్థం పెరిగినట్లు వింటున్నాను. మరాఠీభాషలో ఒకలోకోక్తి ఉన్నది. చెఱువును రక్షించేవాడు దప్పిక అయినప్పుడు నీళ్ళను త్రాగడము సహజము అనిదాని అర్థము. ఈ ఉపమానం చెప్తూ కొందరు "మేమొక సంస్థలో ఉన్నపుడు దానినుండి లాభముపొందితే ఏమితప్పు ?" అని తమ వ్యక్తిగత స్వార్థాన్ని సమర్థించుకొంటుంటారు. అది తగదు. మనం గుర్తించుకొనదగిన సంస్కృత సుభాషితం ఒకటిఉంది."ఛాయా అన్యస్య కుర్వంతి, విష్టంతి స్వయమాతపైః' ఇతరుల కోసము నీడనిస్తూ తాను స్వయముగా ఎండలో నిలుస్తుంది అని వృక్షాన్ని గురించి చెప్తుంది ఆ సుభాషితం. సత్పురుషులు ఆ వృక్షమువంటి వారని వర్ణింపబడింది. తాను ఎండలో ఉండి, యితరులకు నీడనిచ్చే చెట్టు లాగే కార్యకర్త సహకారరంగములో పనిచేస్తే దేశకల్యాణము జరుగుతుంది' అని అక్కడ ప్రసంగంలో చెప్పాను. ఈ మాటలు వారికి రుచించలేదు. అటుతర్వాత నేను నాగపూర్‌కు తిరిగివచ్చేటప్పుడు నాతోపాటు ఒక బ్యాంకు డైరెక్టరు ప్రయాణము చేశారు. ఆయన నాఉపన్యాసమును వార్తాపత్రికలో చదివి-"మీ మాటలు ఎవరికీ నచ్చవు" అంటాడు! సార్వజనిక క్షేత్రాల పరిస్థితి ఇలా తయారైంది. ఇటువంటి స్వార్థము ప్రబలిన క్షేత్రాలలోకి మనము పోతే మనముకూడ చెడిపోతామేమో అనే భయము అప్పుడప్పుడు కొందరికి కలుగవచ్చు. అటువంటి భయం తగదు. ఆ సార్వజనికక్షేత్రము మన వలన చక్కబడుతుందనే విశ్వాసం మన కుండాలి. మట్టి మీద పువ్వు పడితే మట్టియొక్క దుర్గంధము పూవుకు అంటదు. పూవుయొక్కసువాసన

మట్టికి అంటుతుంది - అంటూ సంస్కృత సుభాషితం ఒకటి ఉంది. దానిని గుర్తించాలి. ప్రజలు మననుండి ఎంతో ఆశిస్తున్నారు. మనము ఒక ప్రక్క ప్రభావము కల్గించే చక్కని శాఖలనూ నిర్మించాలి. రెండవప్రక్క స్వయం సేవకులు అన్నిరంగాలలోకి ప్రవేశించి సమాజసేవచేయాలి. రెండువిధాల మనం పురోగమించగలమని నా విశ్వాసం.

శ్రీ గురూజీ మనకువ్రాసిన ఉత్తరములలో ఒకదానిలో 'నేను వెళ్ళి పోయినతర్వాత ఈ సంఘకార్యము మరింత యోగ్యముగా మరింతవేగముతో ముందుకు పోవడము భగవన్నిర్ణయం అయిఉండవచ్చు' అని వ్రాశారు. అది వారికోరిక. దానిని మనం నెరవేర్చాలి.

నేడు సర్వత్రా లక్షలాది స్వయంసేవకులు కనిపిస్తుంటారు. స్వయం సేవకుడు లేనిగ్రామమంటూ ఈ దేశంలో ఉందా అనిపిస్తుంటుం దొక్కొక్క సారి నాకు. అంతగా విస్తరించారు స్వయంసేవకులు. కాని అన్నిగ్రామాలలో సంఘశాఖలులేవు. ఈ స్థితిమారాలి. సర్వత్రా శాఖలుండాలి.

## సంఘకార్య సాఫల్యమే గురూజీకి తగిన శ్రద్ధాంజలి

ప్రస్తుత పర్యటనలో నేను సాధారణంగా గురూజీ బసచేస్తుండిన ఇండ్లలోనే బసచేస్తున్నాను. గురూజీ వెళ్ళిపోవడం వారికి ఎంతవ్యధను కల్గించిందో నాకర్థమవుతోంది. వారు నేడు మనమధ్యలేరనే భావనకూడా మనకు వేదనకల్గిస్తోంది. కాని ఆవేదనతో మనం చేయవలసిందేమిటి? వారి చిత్రపటమును పెట్టి నిత్యమూ పూజచేస్తూ కూర్చొనడమా? లేదా ఒంటరిగా కూర్చొని వారికై కన్నీరు పెట్టుకొనడమా? ఎంతమాత్రము కాదు. వారి కది తగిన శ్రద్ధాంజలికాదు.

ఎల్లరముకలిసి సంఘకార్యాన్ని ముందు తీసుకువెళ్ళాలి. నేటి అవసర మిది. దీనిని గుర్తించి, బాధ్యతతో మనమంతా కార్యరంగంలోకి దిగితే సంఘాన్ని అత్యంత శక్తిశాలినిగా రూపొందించితీరగలం.

నేడు మనకున్నశక్తి తక్కువదికాదు. మనల నెవరూ త్రోసివేయ జాలనంత బలంగా మనం ఉన్నాము. అయితే ఇదిచాలదు. మనం ఏమి చేస్తామో దానిని గమనించాలని ప్రజలంతా గుర్తించేంత బలిష్ఠులంగాలేము. అంతటిశక్తిని మనం ఇంకను సాధించవలసిఉంది. సంఘకార్య సాఫల్యం యిందులోనే ఉంది. అట్టిశక్తిని శీఘ్రాతిశీఘ్రంగా నిర్మించడం మనకర్తవ్యం. ఈ కర్తవ్య నిర్వహణలోనే శ్రీ గురూజీకి నిజమైన శ్రద్ధాంజలి ఉంది. ఎల్లరూ అలా కర్తవ్యనిర్వహణలో నిమగ్నులవుతారని నేను విశ్వసిస్తున్నాను.

# ప్రశ్నోత్తరములు

[విజయవాడ, హైద్రాబాద్‌లలో జరిగిన పురప్రముఖుల సమావేశములలో వేయబడిన ప్రశ్నలు, వానికి శ్రీ బాలా సాహెబ్ దేవరస్ ఇచ్చిన సమాధానములు ఈ క్రింద క్రోడీకరించబడుచున్నవి.]

## హిందూ సంఘటనద్వారా సమస్యల పరిష్కారం

*ప్రశ్న : దేశములోని మతకల్లోల సమస్యలకు రాష్ట్రీయ స్వయం సేవక సంఘమిచ్చు పరిష్కారమేమిటి ?*

సమా : హిందూ సంఘటన. హిందువులలో ఐకమత్యము, సువ్యవస్థిత పరిస్థితి లేనందువల్లనే అనేక సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. ఈదేశపు సమస్య మతకల్లోలములూ కాదు; ముస్లిములు, క్రైస్తవాదులునూ కాదు. హిందువులే. హిందువులలోని అనైక్యతే.

కొందరు భావిస్తున్నట్లుగా-హిందూదేశములో హిందూ సంఘటన కార్యము వర్గతత్వకార్యము కాదు. అది జాతీయకార్యము. హిందూ

సమాజము సంఘటితమైతే దేశములో వస్తున్న ముస్లిం, క్రైస్తవాది సమస్యలు తొలగిపోతాయి.

ఆ సమస్యలు తొలగిపోతాయంటే అర్థము - ఇక్కడ ఉన్న ముస్లింలు క్రైస్తవులు హిందువులైపోతారనికాని, వారు హిందువులుగా చేయబడుతారనికాని కాదు. నేడువారిలోఉన్న వ్యతిరేకాత్మకభావనలుతొలగి పోతాయని మాత్రమే. నేడు హిందువులు విఘటితముగా నున్నారు గనుక వారు అట్టి వైఖరులను అవలంబిస్తున్నారు. వ్యతిరేక వైఖరులకు ఈదేశములో స్థానము లేదని గుర్తిస్తే వారు ఆ వైఖరులను విడనాడుతారు.

దేశ విభజనానంతరము కొంతకాల మట్టి పరిస్థితిని గమనించాము. ముస్లిమాదులు తమ వ్యతిరేకధోరణులకు స్థానముండదని గుర్తించి తమ ప్రవర్తనలోను, మాటలలోను ఎంతో జాగ్రత తీసుకునేవారు. బంగ్లాదేశ్ యుద్ధానంతరముకూడా మనం కొంతవరకు వారిలో అట్టి పరిణామాన్ని గమనించాము. అందువల్ల ఇది హిందువులకు సంబంధించిన సమస్యయేగాని ముస్లిం క్రైస్తవాదులకు సంబంధించినది కాదు.

మతవర్గములకు సంబంధించిన సమస్య - దేశవిభజనానంతరము తిరిగి తలఎత్తింది ఓట్ల రాజకీయములు ఆరంభం కావడంతోనే. కానిఎడల కేరళలో ముస్లింలీగ్ జాతీయ స్వభావము కలదని, ఉత్తరప్రదేశ్‌లో మాత్రము అది వర్గతత్వస్వభావము కలదని భావించుటకు ఆధారమేమిటి? ఇది ఓట్ల వ్యవహారముతో ముడివడియున్న విచిత్ర పరిస్థితి. అందువల్ల ఓట్ల రాజకీయములతో వ్యవహరించు మనవారే ఈ సమస్యలకు ప్రధాన కారకులవుతున్నారనాలి.

మరొక ఉదాహరణ నిస్తాను.

హైద్రాబాద్ సంస్థానమునకు చెందిన ప్రొఫెసర్ నరహర్ కురుందకర్ అనేవారున్నారు. ప్రస్తుతం మరాఠ్వాడాలో ఉంటున్నారు. ప్రఖ్యాత మరాఠీ సాహిత్యకారులు. సోషలిష్టు భావములుకలవారు. హైద్రాబాద్‌లో పోలీసు చర్య సమయంలో వారు హైద్రాబాద్‌లోనే ఉన్నారు. ముస్లిం సమస్యను గురించి వారు నాగపూరులో ఒకసారి ఇలాచెప్పారు. 'హైద్రాబాద్ సంస్థానం నవాబు అధీనంలో ఉన్నంతకాలం రజాకార్లు ప్రబలంగా ఉండేవారు. తామే పాలకులం అనుకునేవారు. అలానే ప్రవర్తించేవారు. హిందువులు భయపడిపోతుండేవారు. కాని పోలీసుచర్య తర్వాత ముస్లింల ధోరణిలో మార్పుకానవచ్చింది. తమపార్శీటోపీ మున్నగునవి మార్చివేశారు. త్రివర్ణ పతాకాలు స్వీకరించారు. హిందువులు కనిపిస్తే స్నేహపూర్వకంగా-'ఎందుకు మనమధ్య ఘర్షణలు. అందరం ఒకటే. మా పూర్వీకులుమాత్రం హిందువులుకాక మరెవరు?'-ఇలా అంటుండేవారు.

ఆ తర్వాత రంగంలోకి రాజకీయ వర్గములవారు ప్రవేశించారు. ముస్లింవర్గము ప్రబలమైన ఓటింగ్‌శక్తిగా భావించారు. ఓట్లకోసం మళ్ళీ వర్గతత్వాన్ని ప్రేరేపించి ప్రోత్సహించ నారంభించారు. తాము ముస్లింల అండన ఉన్నామని భరోసా లిచ్చేవారు. ముస్లింలకు అన్యాయములు జరుగుతున్నాయని, తాము వానిని నివారిస్తామని చెప్తుండేవారు. దీనితో పరిస్థితి మళ్ళీ మారింది. మళ్ళీ ముస్లింవర్గతత్వ రాజకీయము లారంభమైనాయి.

ఇవి నామాటలుకావు. ప్రొ. కురుందకర్ చెప్పింది. ఆయన సంఘ అనుకూలురుకాదు. గురూజీకి వ్యతిరేకంగా ఆయన ఎన్నో రచనలుచేశారు. అట్టి వ్యక్తిసైతము గుర్తిస్తున్న దిది.

వ్యవహారములు ఎలా నడుస్తుంటాయో వివరించేందుకే నేనీ ఉదాహరణ నిస్తున్నాను. మనం ఉదారంగా ఉండవచ్చుకాని సంతుష్టీకరణ విధానంమాత్రం సరియైనదికాదు. రాజకీయరంగములోనివారు అట్టివిధానము లవలంబిస్తున్నారు. మనం ఉదారంగా ఉండగలగాలన్నా, ఎదుటివారు దానిని అలా స్వీకరించాలన్నా మనం బలంగా సుసంఘటితంగా ఉండవలసి ఉంటుంది. హిందువుల సంఘటనవల్లనే ఇలాంటివన్నీ చక్కబడతాయి. మతకల్లోలము లనేవే ఉండకుండాపోతాయి.

## సంఘము :
## హైందవేతరులు

*ప్రశ్న : యోగ్యులగు ముస్లింలను క్రైస్తవులను సంఘంలోనికి చేర్చుకొనడానికి మీకు అభ్యంతరమా ?*

సమా : ఇది వ్యక్తులపరంగా ఆలోచించదగిన విషయం కాదు. ముస్లింలందరూ అయోగ్యులని, హిందువులందరూ యోగ్యులేనని భావించజాలం. వారిలో దేశభక్తులు, వీరిలో దేశద్రోహులు ఉండరని కాదు. అయితే మనం ఇప్పుడు వ్యక్తులపరంగా ఆలోచించడం గాక, సామూహికంగా ఎలా వ్యవహరిస్తున్నారనేది పరిగణించక తప్పదు. ముస్లింవర్గం ప్రస్తుతం సామూహికంగా ఆలోచిస్తున్న ధోరణి దృష్ట్యా మనం సంఘకార్యాన్ని ప్రస్తుతానికి హిందువులకే పరిమితం చేయడం యోగ్యమనుకుంటున్నాము. ముస్లింలు క్రైస్తవులుసైతం సంఘంలోనికి తీసుకొనబడే రోజు ఎప్పుడో ఒకప్పుడు వస్తుందనే ఆశిస్తున్నాం. అయితే అది ఏదో ఒకరిద్దరు ముస్లిములో, మరి ఇతరులో అలా గుర్తించడంవల్ల మాత్రం రాజాలదు. సామూహికంగా మన మాపరిమాణాన్ని గమనించినప్పుడే జరుగుతుంది.

హైందవేతరులుకూడా సంఘకార్యంలో పాల్గొనడం మా కిష్టమే. కాని అందుకు తగిన నిర్ణయం మేమిప్పుడు తీసుకొనజాలం. ముందు హిందూసమాజాన్ని చక్కబరచుకొనడం ప్రస్తుత ప్రయత్నం. బలహీన మైన సమాజం ఉదారత చూపడంకూడా సంతుష్టికరణగానే స్వీకరింప బడుతుంది. మనం సంతృప్తికరంగా సంఘటితులం కాకపూర్వం వారిని స్వీకరించే నిర్ణయం తీసుకునే సంకల్పం లేదు.

*ప్రశ్న : కేంద్రమంత్రులు కొందరు సంఘకార్యాన్ని కమ్యూనల్ అంటున్నారు...*

సమా : మనమంత్రుల ఆలోచనలు రాజకీయ ప్రయోజనాభిలాషలతో నిండి ఉంటున్నాయి. కేరళలో ముస్లింలీగు జాతీయసంస్థ అంటారు. ఉత్తర ప్రదేశ్‌లో మతతత్వసంస్థ అంటారు! సంఘ స్వయంసేవకుల ఓట్లు తమకే వస్తాయని వారనుకుంటే – వారి మాటలూ మారిపోతాయి. కాని మేము వారికి స్తోత్రంచేసేవాళ్ళంగాను, మద్దతుదార్లంగాను తయారుకావాలని ఎవరూ ఆశించజాలరు. తమకు నచ్చిన ఎవరికైనా ఓటుచేసే అధికారం స్వయం సేవకులకుంది. స్వయంసేవకులకు నచ్చే కార్యకలాపాలు తీసుకొనడం పార్టీలవంతు.

ఈనాడు తమ కార్యక్రమములు స్వయంసేవకులకు నచ్చడంలేదని, వారి ఓట్లు తమకురావని వీరు భావిస్తున్నారు. అందువల్ల స్వయంసేవకులను కమ్యూనల్ అంటున్నారు. మమ్మ కమ్యూనల్ అనేవారే నిజానికి తీవ్రమైన వర్గతత్వవాదులు. ఏ నియోజకవర్గంలోనైనా అభ్యర్థిని నిలుపబోయేముందు వారు ఆలోచించేది – అచట ఏఏవర్గములు ఎలా ఎంతెంతబలంతో ఉన్నా యనేది. ఈ విధంగా వర్గతత్వప్రాతిపదికపై అభ్యర్థులను నిలిపే వీరా మమ్మ కమ్యూనల్ అనేది? వీరి మాటలను మేము అంగీకరించజాలం.

## కులవ్యవస్థ

*ప్రశ్న : హిందూసమాజములో కులవ్యవస్థ ఉన్నది. మీరు దానిని సమర్థిస్తున్నారా ?*

సమా : ఈ వ్యవస్థ ఈ సమాజములో ఎలా, ఎప్పుడు, ఎందుకు వచ్చిందనే చర్చ, వివరణ పండితులకు వదలివేస్తాను. నేను అలాంటి పండితుడనూ కాదు. ఆర్. ఎస్. ఎస్ నుండి మీరు అలాంటి చర్చలు ఆశిస్తారని భావించను.

ఇక నేటిస్థితికి వస్తే-నేడు ఏ వ్యవస్థా లేదు. ఉన్నదల్లా అవ్యవస్థ. వికృతి. పూజ్యశ్రీ గురూజీ మాటలలో చెప్పాలంటే "జీర్ణ, శీర్ణ, సమయాతీత" స్థితి.

మనం వర్ణవ్యవస్థ అనడంలో-ఏదో ఆదర్శప్రాయమైన వ్యవస్థ నడుస్తున్నట్లు భావించడం కనిపిస్తుంది. అలాంటిదేమీ లేదని స్పష్టం చేయదలుస్తున్నాను. బ్రాహ్మణులు సైన్యంలోకి చేరుతున్నారు. క్షత్రియులు దుకాణాలు పెట్టుకున్నారు. అందుచేత నేడెలాంటి వ్యవస్థా లేదనే వాస్తవాన్ని మనం గుర్తించక తప్పదు.

దీనినంతా పునరుద్ధరించాలనే సంకల్పమూ మాకు లేదు. అలా జరుగుతుందనే భావమూ లేదు. అందువల్ల మేము దానిని సమర్థించడం; పునరుద్ధరించడం ఇత్యాది ప్రశ్నలే రావు.

## అభివృద్ధిపథకములు

*ప్రశ్న : సత్వర దేశాభివృద్ధికి ఏదైనా పద్ధతిని సూచించగలరా?*

సమా : సత్వరదేశాభివృద్ధి అనేది చాలా మంచికోరికే. కానిఏదేశము

హఠాత్తుగా రాత్రికిరాత్రి అభివృద్ధి చెందదు. క్రమంగా అభివృద్ధిని సాధించాలి మనదేశము చాలా విస్తృతమైనదని, దీని సమస్యలు విలక్షణమైనవని, శతాబ్దాలుగా ఆర్థికంగా దెబ్బతినియున్నదని - ఈ వాస్తవాలనుకూడా గుర్తించవలసి ఉంటుంది. ఈ పరిస్థితిని త్వరితగతిని మార్చుకొనాలి. అది క్రమంగా జరగాలి. సత్వరం అభివృద్ధి సాధించడానికి ఏదో ఒక యోజననే నివ్వగల్గుతానను కొనడంలేదు. అభివృద్ధి అనేది మనందరిపై ఆధారపడి ఉన్న విషయం. అనేక విషయాలను మనం అర్థం చేసుకుంటూ వ్యవహరించాలి. తొందరపాటుతో ఏదైనాచేస్తే అది సత్ఫలితాలనీయక పోగా చిక్కులలోకూడా దించవచ్చు.

ఏయోజన సఫలంకావాలన్నా మనం జాగ్రత పడదగినవి చాలా ఉంటాయి. మన జనసామాన్యం ఎలా ఉంది ? మన రాజకీయ నేతృత్వం ఎలా ఉంది ? మన పరిపాలనాయంత్రాంగం ఎలా ఉంది? ఇవన్నీ ఆలోచించుకొనదగిన అంశాలు. వీని ప్రాముఖ్యం మన అనుభవంలో ఉన్న విషయం. ప్రభుత్వ మొకటి తలుస్తుంది. కాని జరిగేది మరియొకటి. తామేదో సిద్ధాంతానికి కట్టుబడి ఉన్నట్లు కనపడడానికి ప్రయత్నిస్తారు. కాని అందులో తమకే విశ్వాసం ఉండదు. ఇక దానిని అమలు చేయవలసిన ప్రభుత్వోద్యోగయంత్రాంగంలో ఆ విశ్వాసము అసలేలేదు. అందువల్ల మద్య పాన నిషేధం మొదలు అన్నీ విఫలమవుతూనే ఉన్నాయి. ఇదీ పరిస్థితి. రాజకీయ నేతృత్వము. పరిపాలనా యంత్రాంగము, ప్రజల భావములు - వీని మధ్యపొందికయేలేదు. ఈ స్థితిలో త్వరితగతిని అభివృద్ధి జరగాలని ఆశించిప్రయోజనములేదు. సామాన్యుడు సైతం అభివృద్ధికృషిలో పాల్గొనేలా చేయడానికి కృషి జరగాలి. ఓర్పుతో కష్టించాలి. ఎంత త్వరగా అభివృద్ధిని సాధించాలని ఉన్నా దానికి తగిన వ్యవధికూడా తీసుకొనవలసి ఉంటుంది.

*ప్రశ్న : చక్కని సంఘటనాశక్తి ఉన్న ఆర్. ఎస్. ఎస్. దేశ సమస్యల పరిష్కారమునకు ఎందువల్ల కృషిచేయదు?*

సమా : సంఘకార్య స్వరూపం మీముందు పదేపదే ఉంచబడినది. దైనందిన సమస్యలను పరిష్కరించే ప్రత్యక్ష బాధ్యతను మీదవేసుకునే పద్ధతిలో దాని కార్యపద్ధతి యోజింపబడలేదు. యోగ్య వ్యక్తిత్వములను రూపొందించి సమాజ కార్యములకు అందించు కార్యవిధాన మది.

సమాజంలోని సోదరులు సంఘములోనికి రావాలి. వారిపై యోగ్య సంస్కారములు పడాలి. వారు సమాజంయెడ తమకుగల బాధ్యతలను గుర్తించి వ్యవహరించాలి. సంఘం ఆలోచించే విధాన మిది. అందువల్లనే సంఘం దైనందిన సమస్యల పరిష్కారపు ప్రత్యక్ష బాధ్యతను తనపై వేసుకొనలేదు. సమాజంలో మీతోపాటే ఉండే స్వయంసేవకులద్వారాను, వివిధ సంస్థలలో పనిచేస్తుండే స్వయంసేవకులద్వారాను – ఆయా సమస్యలన్నిటిని పరిష్కరించుకుంటూ పోవాలని మేము ఆశిస్తున్నాం.

సంఘం అన్నివిధములైన బాధ్యతలు స్వీకరించాలని మీరు ఆశించడం సహజమే. నేడు ప్రతి రాజకీయపక్షము, ప్రతి స్థానికనాయకుడు సైతము–తనకేమాత్రము బలమున్నా లేకపోయినా – అన్ని సమస్యలను తాను పరిష్కరిస్తాననడం వింటుంటాం. నేటి వాతావరణం అలాంటిది. వారంతా ఆందోళనలు నడపడం, జైళ్ళకు వెళ్ళడం, తీర్మానాలు చేయడం అన్నీ మీరుచూస్తూనేఉన్నారు. ఏ సామర్థ్యమూ లేనివారు, ముగ్గురునల్గురిని మించిన బలం లేనివారుకూడా శాంతి, సువ్యవస్థలకు సంబంధించిన సమస్యలు సృష్టించగల్గుతుంటారు. కొద్దిపాటి బలంతో ఏదోఒకటి చేస్తుంటారు. సంఘం ఆ ధోరణిలో వ్యవహరించదలచలేదు.

అందరూ చేస్తున్నారు గనుక, మనమూ అవిఅన్నీ అనుకరించాలనే ప్రయత్నంకన్న, కొన్ని పరిమితులు ఏర్పరచుకొని నిర్దుష్టమగు కృషి చేయడమే మంచిదని నా భావం. అలా పరిమితులు పెట్టుకొనకుండా-అన్నీ మేమే చేస్తామని బయల్దేరితే ఇటు సంఘకార్యమూ జరుగదు, అటు ఆ పనులూ జరుగవు.

దేశ దైనందినసమస్యలు, ఆర్థిక సామాజిక సమస్యల విషయం మాకు తెలుసు. అయితే అన్నీ మేమే పరిష్కరిస్తామని బయల్దేరడం సరియైనపని కాదు. మేము సమాజ సంఘటన చేయవలసి ఉంది. వ్యక్తులలో సంస్కారాలు కల్గించవలసి ఉంది. అయితే సమాజ జీవనంలోని వివిధ రంగములను గురించి, వివిధ సమస్యలను గురించి, వాని పరిష్కారములను గురించి ఆలోచించడం స్వయంసేవకుల బాధ్యత అనికూడా స్పష్టం చేస్తుంటాం.

దైనందిన సమస్యల పరిష్కారమునకు సంబంధించిన ప్రత్యక్ష బాధ్యతను సంఘం తీసుకొనకపోయినా, ఎక్కడెక్కడ ఏమేమి ఎలాఎలా జరగాలో ఆవిధముగా వ్యక్తులద్వారా పనులు జరుగునట్లు మేము శ్రద్ధ వహిస్తాము.

ఐతే మేము కొన్ని పరిమితులు పెట్టుకొనక తప్పదని విన్నవిస్తున్నాను. అన్నిపనులూ మేమే చేస్తామనే అహంకారంతో వ్యవహరించజాలము. అది హాస్యాస్పదం. కొన్నికొన్ని అర్థశాస్త్ర ప్రవీణులు మాత్రమే చేయదగినవి ఉంటాయి. కొన్నికొన్ని నిపుణులు మాత్రమే చేయదగినవి ఉంటాయి. వాటినన్నిటిని గురించి వారాలోచించాలి. పరిష్కరించాలి. నేను సర్‌సంఘచాలక్‌ను గనుక అవి అన్నీ నేనే చేయాలంటూ వారిచుట్టూ

తిరగడం సాధ్యంకాదు. నిపుణులు చేయదగిన పనులు నిపుణులద్వారా జరగాలి. ప్రధానమంత్రి సైతము వారి సేవలను పొందక తప్పదు.

మేము సంఘటనాకార్యములో నిపుణులము గనుక మాకు అన్ని విషయములలోను నైపుణ్యము పరిజ్ఞానము ఉన్నదనుకొనడం పొరపాటు. మా పరిమితులను గుర్తిస్తూ అధికాధికంగా సమాజసేవాకార్యకలాపాలు నిర్వహించడం మా కోరిక.

## సంఘసేవా పథకములు

*ప్రశ్న : సంఘము ఏవైనా సాంఘిక సేవాపథకములను నిర్వహిస్తోందా ?*

సమా : దేశానికి సేవాపథకములు చాలా కావాలి. మావద్ద అసంఖ్యాకముగా యోగ్యులగు కార్యకర్తలున్నందున మీరు సంఘమునుండి అట్టి సేవలు ఆశించడం సహజమే. క్రమంగా ఈరంగంలో మేముప్రవేశిస్తున్నాము. పలుపథకములు స్వీకరిస్తున్నాము. మేము వీని ప్రచారానికి విశేష ప్రాముఖ్యత నీయడంలేదుకనుక ఈ విషయాలు మీ దృష్టికి వచ్చిఉండవు. మేము ప్రచారమునే సంకల్పిస్తే - వందలాది పథకములను మేమిప్పటికే నిర్వహిస్తుండడం మీకు ఆశ్చర్యము కల్గించవచ్చుకూడా. వివిధప్రాంతాలలో స్వయంసేవకులు నిర్వహిస్తున్న కార్యకలాపములను జాబితా చేస్తే అవి వేలసంఖ్యలో ఉండవచ్చు. ఉత్తరప్రదేశ్, రాజస్థాన్ మున్నగు ప్రదేశాలు నే నిటీవలనే సందర్శించివచ్చాను. అక్కడ వందలసంఖ్యలో శిశుమందిరములు, ఉన్నతపాఠశాలలు, కళాశాలలు మున్నగునవి ఉన్నాయి. వందల సంఖ్యలో విద్యార్థులు ప్రయోజనంపొందుతున్నారు. ఇదేవిధంగా అన్నిప్రాంతములలోను వైద్యసేవలు, సహకారసంఘాలు అనేకానేకం నిర్వహింపబడుతూఉన్నవి.

ఇకముందుకూడా ఇంకా అనేకం ఆరంభమవుతాయి. లభించేకార్యకర్తలు, స్థానిక అవసరాలు, వనరులు మున్నగువానిని బట్టి అవి అన్నీవస్తాయి.

అయితే ఈ సందర్భముగా తామంతా గుర్తించదగిన ఇబ్బంది ఒకటి ఉంది. మేము ఒకప్రక్క శాఖలను విస్తరించి స్వయంసేవకులసంఖ్య పెంచ వలసి ఉంది; వీనితోపాటు ఇలాంటి పథకములనూ నిర్వహించవలసిఉంది. ఇది అంత తేలికపనికాదు. సంఘయంత్రాంగాన్ని నిర్వహించడానికే చాలా శక్తి అవసరమవుతుంది. మేమంతా ఈ పథకాలలోనికి దిగి, సంఘకార్యము నిర్లక్ష్యముచేయబడి, శాఖలు తగ్గిపోతే మీరే దానిని మన్నించజాలరు. సంఘకార్యమును నిర్లక్ష్యముచేసి వీనిని మిమ్మెవరు తీసుకొమ్మన్నారని మీరే అడుగుతారు. సంస్కృతంలో ఒక సుభాషితమున్నది:

*యో ధృవాణి పరిత్యజ్య అధృవం పరిషేవతే*
*ధృవాణి తస్య నశ్యంతి అధృవం నిష్క్రమేవహి*

స్థిరమైన దానిని పరిత్యజించి అధృవమైన దానిని స్వీకరిస్తే స్థిరమైనదీ పోతుంది; అధృవమైనదీ నిష్క్రమిస్తుంది. అట్టిస్థితి సంఘకార్యానికి రాకూడదని మీరూఅంగీకరిస్తారు. అందువల్ల మేము రెండింటి విషయంలోను జాగ్రత వహించవలసి ఉంటుంది.

మొదట సంఘం స్థిరంగా, దృఢంగా ఉండేందుకు, పెంపొందేందుకు మేము కృషిచేయాలి. దానితోపాటు సేవాపథకాలు నిర్వహించబడేట్లు చూచుకొనాలి. ముందుముందు అలాంటవి ఇంకా చేయ సంకల్పిస్తున్నాం. మీరంతా సహకరించి సాయపడితే మీరాశించినంత కృషిని చేయగలమని విశ్వసిస్తున్నాము.

# పాశ్చాత్యపద్ధతిలో అభివృద్ధి

*ప్రశ్న : మనదేశ అభివృద్ధికి పాశ్చాత్య పద్ధతుల ననుసరించడం శ్రేయస్కరమా ? మన ఆధ్యాత్మిక పరంపరకు నష్టము జరుగదా ?*

సమా : అభివృద్ధి అనేది తప్పకజరగాలి. అందుకు ఉపకరించేవి పాశ్చాత్యుల వద్దగాని మరెవరివద్దగాని ఉంటే వానిని తప్పక స్వీకరించవచ్చు. కాని మొత్తముగా పాశ్చాత్యపద్ధతిలో అభివృద్ధికి కృషిచేయడం అర్థరహిత ప్రయత్నం.

పాశ్చాత్యదేశాల అభివృద్ధి ప్రధానంగా భౌతికవిషయాలలో జరిగింది. చక్కని భవనాలు, రహదార్లు, కార్లు, ఆధునిక సౌకర్యాదులన్నిటిలోను వారు అభివృద్ధిని సాధించారు. దానితో తృప్తిపడుతున్నారు. మనంకోరే అభివృద్ధికూడా కేవలం అలాంటిదేనా? కాదు.

మనం ఆధ్యాత్మికదృష్టి కలవాళ్ళం. ఆధ్యాత్మికదృష్టి కలవాళ్ళమంటే అర్థం భౌతిక విషయాలజోలికి పోము అనికాదు. ఆధ్యాత్మికజీవనం చక్కగా నడిచేందుకుకూడా చక్కని భౌతికజీవనం ఆధారంగా ఉండాలి.

ప్రాచీనకాలంలో భారతీయులు భౌతికాభివృద్ధి విషయం ఏమాత్రం పట్టించుకోలేదంటారు కొందరు. నేను వారితో ఏకీభవించలేను. భారతదేశపు స్వర్ణయుగాన్ని పరికిస్తే – చక్కని భౌతికాభివృద్ధినికూడా సాధించడం కనిపిస్తుంది. అయితే అదే సర్వస్వమని మనం ఎన్నడూ భావించలేదు. కేవలం ఆధ్యాత్మికాభివృద్ధియే సమగ్ర అభివృద్ధి అనికూడా భావించాం.

ధనాఢ్యత, దారిద్ర్యాలను గురించి అంతగా పట్టించుకోనవసరం లేదని ఒక సంస్కృత లోకోక్తి ఉంది. కాని అది వ్యక్తులకు సంబంధించినంతవరకే మంచి దృష్టి. సమాజాన్నిగురించి ఆలోచించేటప్పుడు - ఉండదగిన ఆలోచన ఇది కాదు. సమాజజీవనం దారిద్ర్యంతో నిండి ఉంటే, ఆధ్యాత్మికంగా అభివృద్ధి ఉంటుందని భావించజాలం. దేశం భౌతికంగా కూడా బాగా అభివృద్ధిచెందాలని మనం ఆలోచించితీరాలి. భౌతిక జీవన సౌకర్యాలన్నీ ఏర్పరుచుకొనాలి. ఉదాహరణకు - సైన్యం యుద్ధంచేయాలంటే దానికి ఆధునిక ఆయుధసామగ్రి కావాలి. పరిశోధనలు జరగాలి. కర్మాగారాలు నెలకొనాలి. ఇంకా మిసిల్స్, ఆటంబాంబులు మున్నగునవి అనేకం ఉండాలి. ఇలాంటివన్నీ అవసరమైనవే.

సాధారణంగా అభివృద్ధి అంటే భౌతికవిషయాభివృద్ధి. సాధారణంగా అభివృద్ధి అంటే కేవలం భౌతికాభివృద్ధి అనుకొనడంలో విదేశాలు పొరపాటు చేశాయి. భౌతిక జీవనమునకు అతీతమైన జీవనంకూడా ఉంది. అదికూడా చాలా విలువైనది. దానిని గురించికూడా శ్రద్ధ వహించకపోతే అనేక వికృతు లేర్పడుతాయి. సమాజంలోను, జాతిలోను, ప్రపంచంలోను అనేక విపరీతాలు ఏర్పడుతాయి. అట్టి విపరీతాలు, వికృతులు ఇతర దేశాలలో ఏర్పడ్డాయికూడా.

అందువల్ల భౌతికవిషయాలలో శ్రద్ధతోపాటు ఆధ్యాత్మికవిషయాలలో కూడా శ్రద్ధ వహించాలి. మన ఆధ్యాత్మిక వారసత్వాన్ని, మనం ప్రపంచాని కీయవలసిన ఆధ్యాత్మిక వారసత్వాన్ని నిలిపి ఉంచుకొనాలి. అది మన బాధ్యత.

కేవలం విదేశాల ననుకరించి ప్రయోజనం లేదు. వానినుండి తీసుకొనదగింది తీసుకొనాలి; ఇవ్వవలసింది దీయాలి.

## సోషలిజం

*ప్రశ్న. సోషలిజం విషయంలో మీ వైఖరి ఏమిటి?*

సమా: సోషలిజం అనేదానికి నిర్వచనం లేకుండాఉంది. ఇప్పుడు ప్రతి వారూ తాము సోషలిస్టుల మంటున్నారు. కొత్తకాంగ్రెసు, పాతకాంగ్రెసు, ప్రజాసోషలిష్టు, సంయుక్త సోషలిస్టు, సి. పి. ఐ, సి. పి. ఐ (మార్క్సిస్టు) ఇలా ప్రతివారూ సోషలిజమనే అంటున్నారు. మరి ఈ సోషలిజం ఏమిటో నిర్వచించడానికి తగినదో లేదో నాకుతెలియదు. ఒకసారి ఎవరో శ్రీ కృష్ణ మీనన్‌ను సోషలిజాన్ని నిర్వచించమన్నారు. ఆయన – 'సోషలిజాన్ని నిర్వచించడమా? అది నిర్వచించడానికి వీలులేనిది' అన్నాడు! ఇదే ప్రశ్నను శ్రీమతి ఇందిరాగాంధీనిఅడిగారు. "మన సోషలిజం రష్యన్, చైనాల సోషలిజంవంటిది కాదు. స్కాండినేవియన్ సోషలిజం వంటిదీ కాదు. భారత దేశంలో మనసోషలిజం చాలా ప్రత్యేకమైనది. ఎందువల్లనంటే ఈదేశపు అవసరాలు, దృక్పథము, ధోరణులు చాలా విభిన్నమైనవి" అన్నది.

ఈ 'దృక్పథము, ధోరణులు' అనేది చాలా ముఖ్యమైన అంశం. సోషలిజం అనేమాటలో వీనిని వివరించజాలం. వేలాది సంవత్సరాలుగా మనదేశములో ఒకధోరణి అనేది వికసించిందని, జీవితంయెడ ఒకదృక్పథం వికసించిందనీ, అది మన ప్రత్యేకతఅనీ అంగీకరిస్తే – మన తత్వాన్ని ఏ రకపు సోషలిజంలోను నిమడ్చజాలం. సంప్రదాయికంగా మన దృక్పథం ఇలా వివరించబడింది.

*సర్వేపి సుఖినఃసంతు సర్వేసంతు నిరామయాః*
*సర్వే భద్రాణి పశ్యంతు మాకశ్చిత్ దుఃఖమాప్నువేత్ ॥*

ఎల్లరి సుఖమును, భద్రతను ఆకాంక్షించే తత్వ మది. సోషలిజం అంటే ఇదే అయితే మాకేమీ అభ్యంతరం లేదు. అప్పుడు మేమూ సోషలిస్టులమే. బలహీనవర్గాల సహాయానికి వ్యవస్థ నేర్పరచుకొనడ మనేది కూడా మేము అర్థం చేసుకొనగలం. తమ కుటుంబములకు, పిల్లలకు గృహ, వస్త్ర, విద్యా, వైద్యాది సౌకర్యములను కలిగించుకొనేస్థితిలో కొందరున్నారు. ఆర్థికంగా అట్టిస్థితిలో లేని బలహీనవర్గములు కొన్ని. అట్టివారికి విశేష సౌకర్యములు కల్గించుట సోషలిజంలోని భావమైతే మేమూ సోషలిస్టులమే. అలాకాక సోషలిజం అనేది కేవలం ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానమయితే (స్టేట్ కాపిటలిజం) అనగా వ్యక్తికి, వ్యక్తి వికాసమునకు ఎలాంటి ప్రాముఖ్యమూ లేని ప్రభుత్వ నిర్వహణయే అయితే, ప్రతిదానిని ప్రభుత్వపరం చేయుటయే (నేషనలైజ్) దాని లక్షణ మైతే మేము సోషలిస్టులము కాదు. సమాజమందలి ప్రతియొక్కరి, సమగ్ర సమాజపు అభివృద్ధిని గురించి ఆలోచించడము, బలహీనులగు కొందరికి విశేష సౌకర్యములు కల్గించడము సోషలిజం అయితే మా కెలాంటి అభ్యంతరమూ లేదు. అదంతా మీరు సోషలిజానికిచ్చే నిర్వచనంమీద ఆధారపడి ఉంటుంది.

## కమ్యూనిజం

*ప్రశ్న : కమ్యూనిజాన్ని మీరెందుకు వ్యతిరేకిస్తారు ?*

సమా : సోషలిజానికి సంబంధించి ఇచ్చిన ప్రశ్నలో మీకు కొంత సమాధాన మున్నది. కమ్యూనిజమునకు కూడా అది వర్తిస్తుంది.

కమ్యూనిజం అనేది ప్రపంచంలో వివిధరీతులుగా నిర్వచింపబడు తున్నది. పండితనెహ్రూగారైతేము కమ్యూనిజం కాలదోషముపట్టిన దన్నారు.

కమ్యూనిజంలో కొన్ని మంచి అంశములుండవచ్చు. ముఖ్యంగా ఆర్థిక విషయములలో. కాని దాని తత్వమును సమగ్రముగా పరిశీలించి నప్పుడు అది అంతయోగ్యముగా కనిపించదు. అది అన్నిటిని నిరాకరిస్తుంది- మంచివానినికూడా. మతము, ధర్మము, సంస్కృతి మున్నగువానినిసైతం నిరాకరిస్తుంది. సత్యమును పల్కడం వంటివానికి సైతం విపరీతవ్యాఖ్యానం చేస్తుంది. ప్రతిదానిని ఏదో వర్గతత్వమునకు, వర్గకలహమునకు అన్వయించి విపరీతవ్యాఖ్యానం చేస్తుంటుంది.

*జాడ్యం హ్రీమతి గణ్యతే వ్రతరుచౌ దంభః శుచౌ కైతవం*
*శూరే నిర్ఘృణతా మునే ర్విమతితా దైన్యం ప్రియాలాపిని*
*తేజస్విన్ అవలిప్తతా ముఖరతా వక్తవ్యశక్తిస్థిరే*
*తత్కో నామగుణో భవేత్స గుణినాం యోదర్జనై ర్నాంకితః*

అంటూ సంస్కృతంలో ఒక సుభాషితం ఉంది.

*హ్రీరమ్యుంజడుగాగ స్వ్రవతుని మా యుంగా సుచిందంభిగా*
*శూరున్ నిర్దయుగా మునిన్ విమతిగా శ్రోత్రప్రియాలాపు ని*
*స్సారుంగా బలవంతు గర్వితునిగా సద్వక్త వాచాలుగా*
*గ్రూరుం డెన్ని సుధీగుణంబు దురితా రూఢంబు జేయంగదా*

అన్నట్లుంటుంది వారి ధోరణి. ప్రతిదానిని చెడ్డగా చిత్రించడం కమ్యూనిష్టుల ధోరణి. అది మాకు నచ్చదు.

వారి జీవనదృక్పథము, ఆలోచనాసరళియే విపరీతం. మంచిదానినికూడా నిందించే ధోరణి దుస్సహం. ఆవిధంగా మేము కమ్యూనిజానికి వ్యతిరేకులం.

వారు ఆర్థికాది విషయాలలో కొన్ని మంచిభావాలు వ్యక్తంచేసి ఉండవచ్చు. ఉదాహరణకు బలహీనవర్గాలను ఆదుకొనాలనేది. అట్టివానిని స్వీకరించడానికి ఆక్షేపణ ఉండనక్కరలేదు.

## సంఘము :
## రాజకీయములు

*ప్రశ్న : ప్రభుత్వంలో నేడు అవినీతి చాలా ఉంది. ఇట్టిస్థితిలో ఆర్. ఎస్. ఎస్. రాజకీయములలో ప్రవేశించి దేశవ్యవహార ములను ప్రభావితం చేయడం అవసరం కాదా ?*

సమా : దేశజీవితాన్ని ప్రభావితం చేయగలగాలనేదే మా అభిప్రాయం. అయితే అందుకు మార్గములు రెండు. ఒకటి : ప్రత్యక్షంగా రాజకీయము లలో ప్రవేశించి అధికారాన్ని చేపట్టి నిర్వహించడం. రెండు : తగినంతగా బలపడి రాజకీయరంగం మొత్తాన్ని ప్రభావితం చేయగల్గడం. మనం ఇందు ఏదో ఒకటే ఎన్నుకొనవలసి వస్తుంది.

ఆర్. ఎస్. ఎస్. సదాశయములు గల, సువ్యవస్థితమైన మహా సంస్థ అనే విశ్వాసాన్ని ప్రజలకు కల్గించడం ద్వారా—అన్ని జీవనరంగాలను ప్రభావితంచేయగలం. మీ రాశించే ఫలితా లన్నిటిని సాధించగలం.

ఒకప్పుడు కీ॥ శే॥ లాల్‌బహద్దూరుశాస్త్రి పాకిస్థాన్‌తో యుద్ధ సందర్భంలో శ్రీ గురూజీ సహకారాన్ని అర్థించారు. దానిని పొందారు. సంఘం శక్తివంతమైన చక్కని సంస్థ అనీ, దాని సహాయం తీసుకొనదగి ఉన్నదనీ శ్రీ శాస్త్రి భావించారు, తీసుకున్నారు. ఒకసారి అట్టిది సంభవ మైతే మరలకూడా సంభవమే. నేటి రాజకీయవాతావరణంలో అట్టిది సంభవమా అని సందేహించవలసిన పనిలేదు.

దేశజీవితంలోని సమస్తరంగాలను ప్రభావితం చేయగలగాలనేదే సంఘదృష్టి. ఒకసారి జనసంఘం ఆర్. ఎస్. ఎస్. ప్రభావంలోఉన్నదంటూ పత్రికల్లో ఏవోవార్తలు వచ్చాయి. అవిచూచి శ్రీ రవిశంకర్ శుక్లా శ్రీ గురూజీతో ఒకసారి "మీరు జనసంఘాన్ని ప్రభావితం చేస్తున్నారట కదా ?" అంటూ అడిగారు. దానిపై గురూజీ అలాంటిదేమీలేదు - అని సమాధాన మీయలేదు. స్పష్టంగా-"మేము కాంగ్రెసును సైతం ప్రభావితం చేయాలని వాంఛిస్తున్నాం. దేశజీవితమంతటినీ ప్రభావితం చేయాలని వాంఛిస్తున్నాం. మేము వేలాది శాఖలు ఎందుకోసం నడుపుతున్నా మను కుంటున్నారు? జాతి జీవితంలోని సమస్తరంగాలను ప్రభావితం చేయ గలిగేందుకే. కాంగ్రెసుతో సహా అన్ని సంస్థలవారు, అన్ని రంగాలవారు మావద్దకువచ్చి ఏది సరియైన విధానమో అడిగి తెలుసుకొని ఆచరించాలని మా అభీష్టం'' అని అసందిగ్ధంగా చెప్పారు. అదియే సరియైన పద్ధతని మా స్పష్టమైన అభిప్రాయం.

## ఆర్. ఎస్. ఎస్; జనసంఘము

*ప్రశ్న : ఆర్. ఎస్. ఎస్కు జనసంఘానికి గల సంబంధ మేమిటి ?*

సమా : పలువురి మనస్సులలో కూడా ఉన్న ప్రశ్న ఇది. వివరంగానే చెప్పదలిచాను.

క్లుప్తంలో నా సమాధానమడిగితే-ఆర్. ఎస్. ఎస్. కు జనసంఘంతో ఎలాంటి సంబంధమూ లేదు. దాని నియమావళి వేరు; నాయకులు వేరు, యంత్రాంగము వేరు. కార్యరంగము వేరు; ఆర్థిక వ్యవస్థ వేరు. ప్రతిదీ వేరే. ఈవిధంగా ఈ రెండూ పూర్తిగా విడివిడి సంస్థలు.

అయితే క్లుప్తమైన ఈసమాధానము మిమ్ము సంతృప్తిపరచజాలదని నాకు తెలుసు. అందుచేతనే వివరంగా చెప్పదలిచాను.

దీని నర్థం చేసుకొనడానికి 1947 నాటి పరిస్థితులకు మీదృష్టిని మళ్ళిస్తాను. అప్పుడు జనసంఘం లేదు. కాంగ్రెసు మహాసభలు మీరట్‌లో జరిగాయి. మన మిత్రులు శ్రీ కృపలాని అధ్యక్షత వహించారు. అప్పుడు వారంతా ఒక తీర్మానం చేశారు. ఆర్. ఎస్. ఎస్. హింసాత్మక చర్యలు చేస్తుందని, పేరామిలిటరీ అనీ, కమ్యూనల్ అనీ - ఇంకా ఇంకా అని దానిని ప్రభుత్వం నిషేధించాలన్నారు. ఆ తీర్మానం జరిగింది 1947 డిశంబరులో. ఆతర్వాత జనవరి 1948 లో గాంధీజీ హత్య జరిగింది. వెంటనే సంఘాన్ని నిషేధించేందుకు వారు దానిని అవకాశంగా తీసుకున్నారు. అప్పట్లో పటేల్ నెహ్రూలకు మధ్య జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలు ఇటీవల ప్రచురింపబడ్డాయి. మీలో కొందరు చూచి ఉండవచ్చు. ఆ ఉత్తరాలలో పటేల్ - ఆర్. ఎస్. ఎస్‌కు గాంధీజీ హత్యకు ఎలాంటి సంబంధం లేదనే స్పష్టమైన నిర్ణయానికి వచ్చినట్లు వ్రాశారు. పటేల్ చేసిన ఈ ప్రకటన ఆర్. ఎస్. ఎస్‌కు ఈ హత్యకు ఎంతమాత్రం సంబంధం లేదని స్పష్టంచేస్తుంది. అంటే పటేల్ మా ఆశయాలతో ఏకీభవిస్తున్నారని కాదు. ఎన్నో విషయాలపై ఆయన విభేదించేవారు. కాని ఈ విషయంలో స్పష్టంగా నిజం తెలుసు. దానినే నెహ్రూకు వ్రాశారు. అయినా నిషేధం పెట్టబడింది. స్వయంసేవకులు అనేక చిత్రహింసలకు గురిచేయబడ్డారు.

చాలా బాధాకరమైన పరిస్థితిని అనుభవించాం. మేము ఏకాకులం చేయబడ్డాం. ఇదెక్కడి విపరీతం అని శాసనసభల్లోగాని, కేంద్రసభల్లోగాని ఒక్కరుగాకపోతే ఒక్కరైనా అడిగినవారులేరు. దీనిని అన్యాయం అనే సాహసం లేనంతగా పత్రికలుసైతం భయపడిపోయినాయి.

ఆ తర్వాత స్వయంసేవకులద్వారా పెద్దసత్యాగ్రహం జరిగింది. లక్షమందికిపైగా జైళ్ళకువెళ్ళారు. కాంగ్రెసు నిర్వహించిన సత్యాగ్రహాము లన్నిటికన్న పెద్ద సత్యాగ్రహమది. పత్రికలు ఒక్కముక్క వ్రాయలేదు. ఇదంతా సాంఘిక, రాజకీయ రంగములలో పనిచేస్తున్న ప్రముఖులు పలువురికి తెలుసు. కాని ప్రభుత్వానికి వ్యతిరేకంగా నోరుమెదిపే సాహసం లేకపోయింది వారికి. అన్యాయాన్ని ఎదుర్కొనే దిక్కులేకపోయింది దేశంలో. ఇదీ ఆనాటి ఘోరపరిస్థితి.

ఈ పరిస్థితిని మార్చాలని భావించారు పలువురు స్వయంసేవకులు ఏదోఒక రాజకీయపక్షంలోచేరి ఈ స్థితిగతులను మార్చివేయాలని భావించారు కొందరు. సత్యాగ్రహ సమయంలోను, ఆ ముందు ఆ వెనుక కొందరి కొందరి భావము లిలా ఉండేవి. అలాభావిస్తూ వచ్చినవారంతా – డా. శ్యామ ప్రసాద్ ముఖర్జీ ఒక రాజకీయపక్షమును స్థాపించాలనే అభిప్రాయం వ్యక్తంచేయగానే దానికి హర్షించారు. అనేక బాధలకు, చిత్రహింసలకు, అన్యాయాలకు గురియైపోయి, తమతరపున మాట్లాడడానికి ఒక రాజకీయ పక్షం ఉండాలని భావిస్తూవచ్చినవారు, రాజకీయ కార్యకలాపములందు ఆసక్తి కలిగినవారు–అందరూ డా. ముఖర్జీ స్థాపించిన జనసంఘంలో చేరారు. దాని ఆశయాదులు స్వయంసేవకులకు నచ్చడంకూడా కొంతకారణం కావచ్చు.

మరొక కారణంకూడా ఉంది. స్వయంసేవకులు చేరేందుకు మరి వేరే పార్టీకూడాలేదు. మేము ప్రచురించిన "జస్టిస్ ఆన్ ట్రయల్" అనేపుస్తకాన్ని మీరు చూచి ఉంటారు. గురూజీ–పటేల్–నెహ్రూల మధ్య నిషేధసమయంలో జరిగినఉత్తరప్రత్యుత్తరముల సంకలనమది. అందొకదానిలో ఆర్.ఎస్.ఎస్

కాంగ్రెసులో చేరడం దేశానికి మంచిది అంటూ పటేల్ గురూజీకి వ్రాశారు. దానిమీద గురూజీ 'ముందు మీరు నిషేధం తొలగించండి. తర్వాత ఆ విషయం పరిశీలిద్దాం' అన్నారు. నిషేధం తొలగించిన తరువాత పటేల్ కాంగ్రెసు తలుపులు తెరిచి స్వయంసేవకుల నాహ్వానించేందుకు చాలా ప్రయత్నం చేశారు. కాని నెహ్రూ అందుకు అంగీకరించలేదు. ఇవన్నీ పత్రికల్లో వచ్చాయి. ఆ విధంగా కాంగ్రెసు తలుపులు మూసుకొనిపోయి ఉన్నాయి. ఇక పి. ఎస్. పి. వారి విషయానికివస్తే సంఘంపై వారివిమర్శ కాంగ్రెసువారి విమర్శను మించిపోయింది. వారూ తలుపులు తెరువలేదు. 1948, 49 లలో ఈస్థితిగతులన్నీ అనుభవించిన స్వయం సేవకులు జనసంఘంలో ప్రవేశావకాశం లభించగానే అందుజేరారు. ఇదీ పూర్వరంగం. దీనితో ఆర్. ఎస్. ఎస్. జనసంఘము ఒకటేనని భావించడం మొదలైంది. ఈ పూర్వరంగాన్ని మీరు అర్థం చేసుకుంటే జనసంఘంలోనే పలువురు స్వయంసేవకులు ఎందుకు కనిపిస్తారో మీకు అర్థమవుతుంది.

ఐతే సంఘ నియమావళి ప్రకారం స్వయంసేవకులు ఏ రాజకీయ పక్షంలోనైనా చేరవచ్చు. నన్నడిగితే స్వయంసేవకులు అన్ని పార్టీలలో చేరాలంటాను. అందుకు అంగీకరించవలసినవి ఆ పార్టీలే.

ఒక ప్రక్క మమ్మునిందిస్తూ రెండవప్రక్క స్వయంసేవకులు తమ పార్టీలలో చేరాలని అవి ఎలా ఆశిస్తాయి ? అన్ని పక్షాలు స్వయంసేవకులను స్వాగతించగల పరిస్థితిలో ఉంటే బాగానే ఉంటుంది. కాని అది లేదు.

దేశంలో ఒక క్రొత్తరకమైన నికృష్టవర్గతత్వం ఏర్పడింది. రాజకీయమైన కులతత్వం అనవచ్చు దానిని. ఇకముందు కాంగ్రెసువారెవరూ జనసంఘంవారితో వివాహసంబంధాలుకూడా పెట్టుకోరేమో అనిపిస్తుంటుంది. ఇలాంటి పరిస్థితులు దాపురిస్తున్నాయి.

ఈ రాజకీయకులతత్వంతో ప్రజలు సన్నిహితులుగాకూర్చొని దేశ పరిస్థితులను గురించి సమష్టిగా చర్చించుకొనడం అనేదేలేకుండా పోతోంది. ఇది చాలా చెడ్డస్థితి. ఈ రాజకీయకులవ్యవస్థ తు త్తినియలు కావాలంటే స్వయంసేవకు లన్నిపక్షాలలోను చేరాలి. అట్టిదే జరిగితే-ప్రతిఉదయమూ అన్నిపక్షాలవారూ సంఘశాఖలలో కలసిమెలసి వవ్యహరించగల్గుతారు. అది చాలా బాగుంటుంది. మనజాతీయ జీవితంలో రాజకీయాలది పరిమితస్థానమే నని గుర్తించగల్గుతారు. రాజకీయములే జాతి జీవితము నంతటినీ ఆవరించేవి కాదని అర్థంచేసుకుంటారు.

స్వయంసేవకులు ఏ పార్టీలో చేరినా మాకెలాంటి ఆక్షేపణాలేదు. మా నియమావళిలో అందుకు అవకాశంఉంది. అందువల్ల స్వయంసేవకులను తమతమ పార్టీలలోకి ఆహ్వానించుకునే బాధ్యత ఆయా పార్టీల మీదనేఉంది.

*ప్రశ్న : వివిధ రాజకీయపక్షాలలో చేరడంవలన స్వయం సేవకులలో భేధాభిప్రాయాలు పెరుగుతాయి. దానిని ఆపాలని నా ఉద్దేశ్యం....*

సమా : మీ ఉద్దేశ్యం కావచ్చు. నల్గురి అభిప్రాయంకూడా ఉంటుందికదా. అందుకే అది వారిస్వేచ్ఛకు వదిలాం. నచ్చిన పక్షంలో చేరేందుకు, చేరకుండా ఉండేందుకు వీలుగా నియమావళిని రూపొందించుకున్నాం. చేరదల్చినవారిని నిరోధించదలచలేదు.

మనం అన్ని అంశాలను పరిగణనలోకి తీసుకొని వ్యవహరించాలి. స్వయంసేవకులను అదుపు చేయగలగాలంటారుమీరు. అదుపుచేయగలం. కాని చేయదలచలేదు.

యంత్రములు మూసపోత పనిచేస్తాయి. సంఘము అట్టి యంత్రము కాదు. స్వయంసేవకులు ఫలానివిధంగా మూసపోతగా ఉండాలని సంఘం అభిలషించదు. వారివారి అభిరుచులు వ్యవహారణలు వారికుంటాయి. కొన్ని కొన్ని విషయాలలో భావవైవిధ్యం ఉంటుంది. మనం వానిని పట్టించుకొన వలసిన అవసరంలేదు. వారివారి ఇచ్ఛ ప్రకారం తమకు నచ్చిన పక్షములలో, రంగములలో వారు రాష్ట్రసేవ చేయవచ్చు.

## ప్రాదేశిక సమస్యలు;

## సంఘదృష్టి

*ప్రశ్న • ఆంధ్రప్రదేశ్‌ను రెండుగా విభజించే విషయంలో మీ అభిప్రాయమేమిటి?*

సమా : ఇది వేడివేడి ప్రశ్న. ముఖ్యమైనదికూడా. దీనివిషయమై నేనేమీ చెప్పదలచలేదు. అందువల్ల కొన్ని విచిత్రమైన చిక్కులుకూడా రావచ్చు. మర్మంలేకుండా చెప్పవలెనంటే ఈ సమస్యను గురించి నేను సమగ్రంగా పరిశీలించలేదు.

భాషాప్రయుక్తప్రాంత ఏర్పాటులలో మొదట ఏర్పడినది ఆంధ్ర ప్రాంతం. ఆ ప్రయత్నంలో శ్రీ పొట్టిశ్రీరాములు జీవితము నర్పించారు.

కాని, విధివిలాసం! మీ రిప్పుడు విడిపోవాలనుకుంటున్నారు. మీరు రెండుగాఉన్నా ఒకటిగాఉన్నా ఏదైనా పర్వాలేదు. ఒకభాషకు ఒకేప్రాంతం ఉండాలనే సూత్రముకాదు ఆమోదింపబడింది. ఇప్పుడు హిందీ మాట్లాడే ప్రాంతాలు నాలుగు ఉండడం చూస్తూనేఉన్నాం. అందువల్ల ఒకభాషకు ఒకే ప్రాంతం ఉండాలని ఎవరూ వాదించజాలరు. మీరేదైనా స్థానిక కారణాల

వల్ల విడిగా ఉండాలని భావిస్తే - అందుకు నా ఆక్షేపణ ఏమీలేదు. మీకు ఏది తగినదో నిర్ణయించుకోనవలసింది మీరు.

ముందు ప్రభుత్వం ఒక నిర్ణయానికి రావడం అవసరం. విభజనకు వారంగీకరించకపోవచ్చు. లేదా అంగీకరించవచ్చు. ఏ నిర్ణయానికి వచ్చినా సరిగా ఆలోచించిమాత్రం రావాలి. అది పార్టీ ప్రయోజనదృష్టితో ఉండరాదు. అసలిందులో పార్టీ ప్రసక్తి రాకూడదు.

ప్రస్తుతం షట్సూత్రపథకం అని వచ్చింది. దానిని నేను సమగ్రంగా పరిశీలించలేదు. కాని జిల్లాలవారీగా ఆలోచించే విధానానికి నేను వ్యతిరేకినని మాత్రం స్పష్టం చేయదలుస్తున్నాను. మేము ప్రతిదానిని అఖిల భారత దృష్టితో చూస్తాం. శ్రీ గురూజీకి శ్రద్ధాంజలి సర్పిస్తూ పలువురు ప్రముఖులు- అఖిల భారతదృష్టితో ఆలోచించే ఏకైకవ్యక్తి శ్రీ గురూజీ అని ప్రశంసించడం మీరు గమనించి ఉంటారు. మా దృష్టి అలాంటిది.

ప్రాంతాలమధ్య తగాదాలకు సంబంధించి గురూజీ ఒక సామెత అంటుండేవారు. పప్పు పళ్ళెంలో పడితే ఏం కటోరీలో పడితేనేం? అంతా చివరకు కడుపులోకి వెళ్ళేదేకదా అని.

చిన్నచిన్న విషయాలలో ఎందుకు తగవులాడుకుంటారు? ఒక గ్రామం ఈ జిల్లాలో ఉంటేనేం? ప్రక్క జిల్లాలో పడితేనేం? అఖిలభారత దృష్టితో మీరెందుకు ఆలోచించరు? అంటుండేవారు శ్రీ గురూజీ. తమను అపార్థం చేసుకున్నా పట్టించుకునేవారు కాదు. వినోబాజీ ప్రభృతులంతా శ్రీ గురూజీకి శ్రద్ధాంజలి సర్పిస్తూ ప్రత్యేకంగా ప్రశంసించింది ఈ అఖిల భారతీయ దృక్పథాన్ని.

స్థానిక సమస్యలు, భావాలు ఉంటాయని నే నంగీకరిస్తాను. కాని వానిని అఖిలభారత దృష్టితో చూడగలగాలి. అలా చూచినప్పుడు ఇచట ఒక ప్రాంతమున్నా రెండు ఉన్నా ఏమీ పర్వాలేదు. కాని జిల్లాలవారీగా ఆలోచించడం, జిల్లాలవారీగా ఉద్యోగాలివ్వడం - ఇత్యాదులు హాస్యాస్పద పరిస్థితులు కల్పిస్తాయి. తల్లిదొక జిల్లా, తండ్రిదొక జిల్లా, మామ దింకొక జిల్లా అవుతుంటుంది. అప్పుడు జనం ఉద్యోగాలకోసం తమ స్థానాన్ని గురించి అన్నిరకాల తప్పుడు ప్రమాణాలు చేయడం, తప్పుడు సాక్ష్యాలు పుట్టించడం జరుగుతుంటుంది. మహారాష్ట్ర - మధ్యప్రదేశ్ సరిహద్దులకు అటుప్రక్క ఒక గ్రామము, ఇటుప్రక్క ఒక కాలేజీ గల గ్రామము ఉండేది. చదువుకోసం ఆవలి గ్రామంనుండి పిల్లలు ఈవలి గ్రామానికి వస్తుండేవారు. కాలేజీలో ప్రవేశంకోసం తప్పుడు సాక్ష్యాలు, ఆధారాలు పుట్టిస్తుండేవారు. ఇవతలి ప్రాంత ప్రభుత్వం ఇచ్చే సౌకర్యాలన్ని తప్పుడు సాక్ష్యాలతో పొందేవారు. ఇదంతా తెలిసికూడా విద్యాలయాధికార్లు మన కెందుకని ఊరుకుంటుంటారు. ఇలాంటివి మీరూ అనుభవించవలసివస్తుంది. ఆచరణయోగ్యంకాని నిబంధనల నెక్కువ చేసుకుంటూ పోతే, మనం ప్రజలను అవినీతిపరులుగా చేసినవారమవుతాం.

నాకున్న అభిప్రాయా లిలాంటివి. అందువల్ల ఆంధ్ర ఒకటిగా ఉండాలా రెండుగా ఉండాలా అనేవిషయమై నేను స్పష్టమైన ప్రకటన చేయదలచలేదు. ఏమి చేసినా సమగ్రంగా ఆలోచించి చేయాలని, సమస్య కన్న పరిష్కారం ఘోరంగా ఉండరాదని - రోగంకన్న మందు ఘోరం కాకూడదని - మాత్రం అంటున్నాను.

*ప్రశ్న : కర్ణాటక - మహారాష్ట్ర సరిహద్దు వివాదాన్ని గురించి మీ అభిప్రాయమేమిటి ?*

సమా : స్థానీయ, ప్రాంతీయాది సమస్యలన్నిటి విషయంలోను సంఘానిది అఖిల భారత ప్రయోజన దృష్టి అనేది పలుమారులు వక్కాణించాం. ఈ విషయాన్ని గురూజీ ఎన్నోమారులు స్పష్టం చేశారు. ఇలా వక్కాణించడంలో ఒక్కొకసారి వారిని కొందరు అపార్థంచేసుకొనడంకూడా జరిగేది. అయినా పట్టించుకునేవారుకాదు.

భాషా సమస్య ఏర్పడినా, ప్రాంతాలమధ్య సరిహద్దులసమస్య లొచ్చినా, నదీజలాలకు సంబంధించి వివాదము లొచ్చినా శ్రీ గురూజీ అట్టి వైఖరినే అవలంబించేవారు. ఒకప్పుడు బెల్గాం సమస్యవచ్చింది. పంజాబు విభజన సమస్యవచ్చింది. పంజాబీ భాషకు ఈయవలసిన ప్రతిపత్తిని గురించి వారు చెప్పినదానిని కొందరు విమర్శించారుకూడా. దేశమును భాషా ప్రయుక్తంగా విభజించడం అనే ప్రశ్నవచ్చినప్పుడు గురూజీ ఆ ప్రయత్నముతో ఏకీభవించజాలమని స్పష్టంగా చెప్పారు. ఫజలాలీ కమిషన్ నాగపూర్ వచ్చి గురూజీని కలుసుకున్నది. తమ కందులో అసక్తిలేదని చెప్పారు. అంతేకాదు. భాషాప్రయుక్త విభజనవల్ల రకరకాల సమస్యలు తలఎత్తే ప్రమాదమున్నదని హెచ్చరించారుకూడా. ఇట్టి దృక్పథం కల్గిన సంఘానికి భాషా, ప్రాంత వివాదాలపై కల్లోలాలు రేగడం ఎంతబాధకల్గిస్తుందో మీరు ఊహించుకోవచ్చు. ప్రాంతీయసమస్యల కారణాన దేశానికే నష్టదాయకమైన ధోరణు లవలంబించకండి–అంటానునేను. మాది అఖిల భారతీయ దృష్టి. ప్రాంత భాషా వివాదాలు మాకు వేదనకల్గిస్తున్నాయి.

## విదేశీ ప్రభావములు

*ప్రశ్న : భారతదేశములో రష్యా ప్రభావవ్యాప్తిని గురించి మీరేమంటారు ?*

సమా : రష్యాతో భారతదేశము ఒడంబడిక చేసుకొనడంలో అసహజమైన దేమీలేదు. ప్రతిదేశము మరొకదేశముతో ఏవో ఒప్పందాలు చేసుకొనవలసిన అవసరాలు వస్తునేఉంటాయి. మనమిప్పుడు కొన్ని విషయాలలో బలహీనంగా ఉన్నాం. నూనె, ఆయుధములు, కార్లు-ఇలా అనేక విషయములలో మనకు కొన్ని కొరతలున్నాయి. కొన్ని రాజ్యాలతో ఒప్పందాలు చేసుకొని వానిని సంపాదించవలసి ఉంటుంది. నేటి పరిస్థితిలో మనం రష్యాతో అట్టి ఒప్పందాలు చేసుకొని ఉండవచ్చు. ఇది పదిహేనేండ్ల ఒప్పందం. అందు అనేక ప్రకరణాలున్నాయి.

సాధారణంగా ఇలాంటి ఒప్పందాలలో వాడే భాష ప్రధానంకాదు. అది మామూలుగానే ఉంటుంది. కాని వాని వ్యాఖ్యానములు, అవి అమలుజరిగే తీరు ముఖ్యం. మనం ఒప్పందం చేసుకున్నాముగనుక, దాని ప్రభావములో పడిపోయినాము అనుకొనవలసిన పనిలేదు. అది అమలుజరిగే తీరుముఖ్యం.

భుట్టో విషయం మీకుతెలుసు. ప్రతిదానినీ అతడు ఎలా వ్యాఖ్యానిస్తాడో తెలుసు. సిమ్లా, ఢిల్లీ ఒడంబడికలపై సంతకాలుచేసి ఇస్లామాబాద్‌లో దిగగానే 'నా వ్యాఖ్యానం ప్రకారం....' అంటూ ఏదో అంటాడు. వెంటనే శ్రీమతి ఇందిరాగాంధి 'అది కానేకాదు. ఆ వ్యాఖ్యానం ఒడంబడికతత్వానికి అనుగుణంకాదు' అంటుంది. ఇలా జరిగిపోతోంది. ఇట్టిది జరుగకుండా చూచుకొనాలి.

ఒప్పందాలనేవి కేవలం కాగితంముక్కలు. అమలునుబట్టి ఉంటుంది వాటివిలువ. రెండవప్రపంచసంగ్రామం కాగానే ఒప్పందాలు జరిగాయి. ఏమి జరుగుతోంది? అందువల్ల ఒప్పందాలకన్న ముఖ్యమైనది వానిని ఆయా నాయకులు ఎలా వ్యాఖ్యానిస్తారు? ఎలా వివరిస్తారు? ఎలా అమలుచేస్తారనే

విషయాలు. అవి మనదేశ ప్రయోజనాలకు అనుగుణంగా ఉండేట్లు నాయకత్వం జాగ్రత వహించాలి. అలాజరిగితే రష్యాతో ఈ ఒప్పందంవల్ల పెద్ద సమస్యలేవీ రావలసినపనిలేదు.

అయితే ఇక్కడొక సమస్యఉంది. మనం బలహీనంగాఉన్నాం. వారు శక్తివంతులుగా ఉన్నారు. ఇది బలహీనులకు, శక్తివంతులకుమధ్య జరిగిన ఒప్పందం. నాయకత్వం ఎంతో వివేకంతోను, జాగ్రతతోను, దార్ఢ్యంతోను ఉంటేతప్ప బలహీనులు ఒప్పందాలను సరిగా వ్యాఖ్యానించి, అమలుచేయడం సాధ్యంకాదు.

ఉదాహరణకు— నేడు వారేదోపథకానికి కొంతద్రవ్యం ఇస్తామంటారు. రేపు ఇవ్వడం ఆపివేస్తున్నామంటారు. అదేమీపర్వాలేదు. ఎలాగోలా కష్టించి సర్దుకుపోతాం. కాని ఆయుధసంపత్తికొరకు వారిమీద పూర్తిగా ఆధారపడ్డామనుకోండి. ఇవాళ టాంకులు, విమానాలు, పరికరాలు ఇస్తారు. రేపు బిగపడుతారు. అప్పుడు మనం విచిత్రపరిస్థితిలో చిక్కుకుంటాము. విడిభాగాలు లేనందువల్ల నిరుపయోగంగా ఉండే రష్యను ఆయుధాలుమాత్రమే మనకు మిగులుతాయి !

ఈజిప్టు, ఇజ్రేయిల్‌ల విషయంలో ఏమి జరిగింది ? రష్యనులు, అమెరికనులు ఒత్తిడి చేసేసరికి — వారికి ఇష్టమున్నాలేకపోయినా యుద్ధ విరమణకు అంగీకరించవలసివచ్చింది. వారినుండి ఆయుధాలు, స్పేర్ పార్టులు రాకపోతే వారేమీ చేయలేనిస్థితి. ఇలా మన వ్యవహారాలు వారి కనుసన్నలలోపడిపోతాయి. ఒకప్పుడవి మనకు ప్రమాదహేతువులుకావచ్చు.

అందువల్ల మన మెలాంటి చిక్కుల్లోను పడకుండా సహాయాలన్నిటిని పొందేలా ప్రభుత్వం జాగ్రతతీసుకొనవలసి ఉంటుంది.

## అన్యవిషయములు

*ప్రశ్న : కుటుంబనియంత్రణ విషయంలో మీ అభిప్రాయ మేమిటి ?*

సమా : అది నేనే మిమ్ముృవేయదగినప్రశ్న. కుటుంబనియంత్రణ అనేదానికి నేను మొత్తంగా వ్యతిరేకి ననజాలను. ఏదో కొంత ప్రణాలికాబద్ధమైన యోజనజరగాలి. అందు జనబాహుళ్యాన్నికూడా పరిగణలోనికి తీసుకొన వలసి వస్తుంది.

అయితే ఈ మితసంతానయోజన అనేదానిని కేవలం హిందువులే స్వీకరించడం, రోమను కాథలిక్కులు, ముస్లింలు తమతమ మతములపేరిట వ్యతిరేకించడంతో ఈప్రశ్న వస్తున్నది. ఈ పరిస్థితి ఇలాగేజరిగితే కాల క్రమంలో హిందువుల జనసంఖ్య తగ్గిపోయి ఇతరులలో పెరిగిపోతుందనే భయము హిందువులలో ఉంది. ఇది ఆలోచించవలసిన అంశము.

మనది ప్రజాస్వామ్యం. ప్రజాస్వామ్యంలో జనసంఖ్యలకు చాలా ప్రాముఖ్యముంది. మితసంతాన యోజన అనేది పాక్షికంగానే అమలుజరిగితే-అనగా హిందువులుమాత్రమే స్వీకరించి అన్యులు నిరాకరిస్తే-అది సరియైన స్థితికాదు. అట్టిది జరుగకుండా చూచేబాధ్యత మనందరిమీదను-ముఖ్యంగా ప్రభుత్వంమీదను ఉంది. ఇక ప్రస్తుతం అమలుజరుగుతున్న కుటుంబ నియంత్రణ పద్ధతులు శారీరకంగా వ్యక్తులపై ఎట్టిప్రభావాలు కల్గిస్తాయనే

విషయాన్ని-వైద్యకోవిదుల, శాస్త్రజ్ఞుల పరిశీలనకు మార్గదర్శనకు వదలి వేస్తాను.

*ప్రశ్న : కమిటెడ్ జ్యుడీషియరీ (బంధిత న్యాయవ్యవస్థ) అనే దానిని గురించి మీ అభిప్రాయమేమిటి ?*

సమా : మీ అభిప్రాయమే నా అభిప్రాయముకూడా. న్యాయవ్యవస్థ బంధితంగా ఉండడం వాంఛనీయంకాదు. అట్టి బంధితస్థితి ఏ రంగమునకు కూడా తగినదికాదు. మనసుతెరచి మంచిని స్వీకరించే పరిస్థితి అన్ని రంగాల లోను అవసరమే. లేకపోతే కొత్తభావాలను స్వీకరించలేము. జీర్ణించుకొన లేము. ఆచరించలేము. న్యాయవ్యవస్థ అలాలేకుండా బంధితమై ఉండడం ప్రయోజనకరంకాదని నా భావం.

*ప్రశ్న : సంఘ ఉత్సవాలలో దేశ విభజనకు పూర్వపు భారత దేశ చిత్రపటమును ఉపయోగిస్తారెందుకు ?*

సమా : రాజకీయ చిత్రపటములు వేరు. సాంస్కృతిక చిత్రపటములు వేరు. రాజకీయముగా దేశముల చిత్రములు మారినా సాంస్కృతికముగా తేలికగా మారవు. సంస్కృతి అనేది చాలా విస్తృతమైనది. స్థిరమైనది. అది జీవన పరివ్యాప్తం. సంఘము సాంస్కృతిక సంస్థ. సాంస్కృతిక చిత్ర పటములు వాడుతుంటుంది.

సాంస్కృతిక భారతి చాల విస్తృతమైనట్టిది. ఒక వెయ్యేండ్లక్రితం-అంతకుపూర్వము - ఎందరెందరో భారతీయులు దేశదేశములకు వెళ్ళి ఈ సంస్కృతిని వ్యాపింపజేశారు. ఆంధ్రమండి కూడా ఎందరో వెళ్ళి ఉండిన విషయం మీకు తెలిసే ఉంటుంది. ఇండొనీషియా, జావా,

సుమిత్రా, బోర్నియో ఇత్యాది ఎన్నెన్నో దేశములలో భారతీయ సంస్కృతి వ్యాపించింది. ఇదంతా గర్వించదగిన విషయం. ఇటీవలివరకు - రెండవ ప్రపంచ సంగ్రామంవరకు - ఆంగ్లేయుల సామ్రాజ్యమున రవి అస్తమించ డని ప్రతీతి. ఇప్పుడు రష్యా అమెరికా రాజకీయములు అలా ప్రపంచపు నలుమూలలా వ్యాపించి కనిపిస్తాయి. ఒకప్పుడు సాంస్కృతికంగా భారత దేశపు స్థితి ఆవిధంగా ఉండేది. అది రాజకీయ విస్తరణవంటిది కాదు. సాంస్కృతిక విస్తరణ. ఈ చిత్రపటములద్వారా ఆ వాస్తవము గుర్తు చేయబడుతుంది. అందు తప్పులేదు.

నేడు ఇరాన్ భారతదేశముతో సాంస్కృతిక ఒడంబడిక చేసుకున్నట్లు వార్త వచ్చింది. ఇలాగే పలుదేశాలు మనతో సాంస్కృతిక వప్పందములు చేసుకొనడం చూస్తుంటాం. ఈ వప్పందాలవల్ల మనకేమి అర్థమవుతుంది? ప్రాచీన కాలమున భారతీయ పండితులు ఆయా దేశములకు వెళ్ళి ఎన్నెన్నో మంచిమంచి సంగతులు తెలియజెప్తుండేవారని అర్థమవుతుంది. తమ తమ ప్రసంగాలలో వారే ఆ సంగతులు చెప్తుంటారు. క్రిందటిసారి ఇరాన్ రాజు భారతదేశమునకువచ్చి, విమానాశ్రయంలో ప్రసంగిస్తూ - మన పూర్వీకులు తమ దేశానికివచ్చి గణితశాస్త్రము మున్నగునవి ఎన్నెన్నో నేర్పినట్లుగా చెప్పినట్లు నాకు గుర్తు. ఆ విధంగా మన పూర్వీకులు విజ్ఞానవ్యాప్తిచేశారనే విషయాన్ని మన కొత్తతరాలకు తెలియజేయడం, గుర్తుచేయడం అవసరం. ఇలాంటి చిత్రపటాలను ప్రదర్శించడంలోని దృష్టి అది.

దేశాలమధ్య సాంస్కృతిక సంబంధాలవల్ల ఒక విధమైన ఏకత్వ భావన పెంపొందుతుంది. ఐరోపాదేశాలు ఆర్థికంగా సన్నిహితమై యూరోపి యన్ ఎకనామిక్ కమ్యూనిటీని ఏర్పరచుకున్నారు. తద్వారా రాజకీయమైన సమైక్యతకూడా ఏర్పడుతుంది. దానితో రష్యా. అమెరికా రాజకీయములను

వారు ఎదుర్కొనడంకూడా జరుగుతుంది. వారంతా ఒకేరాజ్యంగా, ఒకే జాతిగా మారిపోవడంలేదు. కాని సమైక్యత పెంపొందుతోంది. ఐరోపాలో ఆర్థిక సమైక్యత ద్వారానే అట్టి శక్తి నెలకొనడం సంభవమైనప్పుడు, ఇతరత్రా సాంస్కృతిక సమైక్యతద్వారా అట్టి శక్తి ఎందుకు ఉత్పన్నంకాదు? భారత దేశము బలపడి-సింగపూర్, మలేషియా, జపాన్, ఇండొనీషియా మున్నగు దేశదేశాలు అన్నీ మన సాంస్కృతిక సమైక్యతను అవగాహనచేసుకుంటే ఈ మండలంలో కూడా ఐరోపా ఆర్థిక సమాఖ్యవంటి ఒక ప్రబల సమైక్యశక్తి ఆవిర్భవిస్తుంది. అట్టి సాంస్కృతిక సమైక్యతాశక్తి వాంఛనీయమేకదా!

## సంఘతత్వ ప్రచారము

*ప్రశ్న : ఆర్. ఎస్. ఎస్. కు ప్రచారమెందుకు చేయరు ?*

సమా : ప్రచారము చేసుకొనవలెననే మనస్తత్వము మాకులేనిమాటనిజము. దీనివల్ల కొంతమేలు జరుగుతుంది. కొంతనష్టము జరగడంకూడా నిజమే.

కార్యకర్తలను ఒక చక్కని పద్ధతిలో తీర్చిదిద్దవలెననేది మా సంకల్పము. ఇతరత్రా చాలచోట్ల కార్యకర్తలు పని ఎక్కువచేయకుండా ప్రచారమునకు తాపత్రయం పడుతుండడం గమనిస్తాం. ఫొటోలు పత్రికలలో పడాలని కోరుకుంటూ ఉంటారు. పని తక్కువ ప్రచారమెక్కువగా వారి వ్యవహారాలు నడుస్తుంటాయి. అట్టిది సంఘకార్యాకర్తల విషయంలో జరగడం మాకు ఇష్టంలేదు. అందువల్ల ప్రచారపుధోరణులకు మేముకొంత దూరంగా ఉంటుంటాం. దీనివల్ల చాలా మేలు జరిగింది. సంఘకార్యకర్త అనగానే అతడు నిష్కామంగా చక్కగా పనిచేస్తాడని, పేరును ప్రచారాన్ని

ఆశించని చక్కని సంఘ సేవకుడని గమనిస్తూఉంటాం. ప్రచారపుధోరణు లకు తగినంతదూరంగాను, జాగ్రతలోను ఉండడంవల్ల ఇది సాధ్యమైంది.

దీనివల్ల కొంతనష్టం కూడా జరిగింది. సంఘకార్యమును గురించి ప్రజలకు తెలియవలసినదంతా తెలియకపోవడం, దుష్ప్రచారములు చేసేవారి మాటలను కొందరు అమాయకంగా నమ్మడం ఇత్యాది. ఇప్పుడు మేమీ విషయంలోకూడా జాగ్రతతీసుకుంటున్నాం. కొన్ని ప్రచురణసంస్థలను నెల కొల్పడం లేదా కొందరు స్వయంసేవకుల ద్వారా అట్టివానిని, దిన, వార, మాసపత్రికాదులను నెలకొల్పింపజేసి ప్రోత్సహించడం – ఇత్యాదులు చేస్తున్నాం. క్రమంగా ప్రచారయంత్రాగాన్ని నెలకొల్పుతున్నాం.

## సంఘకార్యమున సామాజికుల సహకారము

*ప్రశ్న : సంఘం మానుండి ఆశిస్తున్న దేమిటి ?*

సమా : ఉన్నదున్నట్లు మీతో అనదలిచాను. మా కార్యపద్ధతిలో సంఘశాఖ అనేది అత్యంత ప్రాముఖ్యముగల్గినట్టిది. ప్రతిహిందువు సంఘశాఖకు రావాలనేది మా ఆకాంక్ష. ఎవరైనా–'మేము పెద్దవాళ్ళమయినాం'–అంటే 'వచ్చి కూర్చోండి. మీరు శారీరక కార్యక్రమాలలో పాల్గొననక్కరలేదు' అంటాం. ఒకపేటలో నివసించేవారందరూ నిత్యమూ నియమానుసారము నిర్ణీత సమయానికి ఒకచోట కలియడంకూడా మంచి ఫలితాలనిస్తుంది.

పూజ్యశ్రీ గురూజీ దివంగతులైనందుకు మనమందరం ఎంతో బాధ చెందాం. శ్రద్ధాంజలి నర్పించాం. ఆయన మహనీయులు. కనుక శ్రద్ధాంజలి నర్పించాం. మరొక కారణంకూడా ఉన్నది. ఆయనపేరును స్మరించగానే మన కళ్ళముందు కన్పించేది మహత్తరమైన సంఘము, వేలాది సంఘశాఖలు,

లక్షలాది స్వయంసేవకులు. వీనన్నిటిదృష్ట్యాకూడా వారికి మనం శ్రద్ధాంజలి నర్పించాం. అందుచేత సంఘశాఖ, స్వయంసేవక్ అనేవి చాలాముఖ్యమైనవి. దానిని వక్కాణించదలుస్తున్నాం.

అయితే మీలో కొందరు రాలేకపోవచ్చు. అట్టివారు ఏదో విధంగా సంఘంతో సంపర్కం ఉంచుకొనాలి. విశేషకార్యక్రమాలకు వస్తుండాలి. మనస్వయం సేవకులు కొందరు విశ్వహిందూపరిషత్‌వంటి సంస్థలలో పని చేస్తున్నారు. అనేక సేవాపథకములు నిర్వహిస్తున్నారు. ఈ విజయవాడ నగరమునందుసైతం స్వయంసేవకులు కొన్ని పాఠశాలలు నిర్వహిస్తున్నారని విన్నాను. ఇంతకు పూర్వమే ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్‌మున్నగు ప్రాంతములు పర్యటించివచ్చాను. అచ్చట సంఘకార్యకర్తలు ఎన్నో పాఠశాలు, వసతిగృహములు మున్నగునవి నిర్వహిస్తున్నారు. ఇలాగే వివిధ ప్రాంతములందు మనకార్యకర్తలు అనేక సేవాపథకములు స్వీకరిస్తున్నారు. మీరు వీని విషయంలో సహకరించవచ్చు. మీ రెలా సహకరించగల్గుతారో మీరు తెలియజేయండి. ఏమిపథకములు స్వీకరింపబడుతున్నాయో తెలియజేయుచుండుట మావంతు. సహకరించుట మీవంతు.

వీలున్నంతవరకు సంఘశాఖలతో మీరు సన్నిహితసంబంధంకల్గి ఉండాలనేది మా అభీష్టం. అది సాధ్యం కాకపోతే ఈమాదిరి సేవాపథకాలలో మీరు ఇవ్వగల్గినంతఎక్కువ సహకారములు ఇస్తుండండి. అలా సహకరిస్తూ ఉండవలసిందిగా అందరికీ నావిజ్ఞప్తి.

